# విప్లవ సందేశం.

## (క్రోపాట్కిన్)

అనువాదకుడు

మహీధర జగన్మోహన్‌రావు.

విశ్వసాహిత్యమాల

ముంగండ (Via) అంబాజీపేట.

# క్రోపాట్కిన్ జీవితంలో

ద్వితీయముద్రణం...1939

యమ్. యన్. పి. పట్న్ర, మారుటేరు.

వెల 2 అణాలు.

# మామాట.

ఐదోఏడాది

ప్రారంభం అయిందన్నమాట ఈపుస్తకంతో. గత నాలుగుసంవత్సరాలూ తోడి ఆంధ్రులు చూపిన ఆదరాతిశయాలు కనబరచిన శ్రద్ధాకారణంగా మా ఐదో ప్రచురణ సందేశాన్ని నేడు 'విప్లవసందేశం' పేరిట తిరిగి అందిస్తున్నాం.

తిరిగీ_అన్నది మాటవరసకేగాని, పుస్తకం క్రొత్తదే అయింది. రచన పూర్తిగా సంస్కారాన్ని పొందింది. ఎంతో ప్రయత్నంచేసి, ఎన్నిపుస్తకాల్లో తడవి గ్రంథకర్త జీవితం చేర్చాం.

కాని, వెల అదే, పుస్తకం పెరిగినా. ఇంక మామాటకేసి తిరిగి చూచుకొని ఆలోచించితే___

___నాలుగేళ్ళకి ఇంచుమించు ఇరవై అయిదువందల పుటలుగల ఇరవై పుస్తకాల ప్రకటన! నిజంగా సిగ్గుపడవలసిన విషయం ఆంధ్రులకి. విదేశాలలోని గ్రంథమాలలు ఒక్క నెలలో ఇంతకంటె ఎక్కువపుటలు ప్రకటించగలుగుతూన్నాయి. నిజానికి విద్యావిషయంలో వారికన్న కొన్నివందలయేళ్ళు వెనుకబడి యున్నాం. కాని, క్రిందపడ్డా నేనే నెగ్గిననే మన ఆంధ్రులు తమ జాతీయతకేదో ప్రత్యేకత వుందనుకుంటూ ఈ అజ్ఞానాన్ని సుస్థిరం చేసుకుందుకే శ్రమపడడం విచారకరం.

చాలమంది కరమకట్టిన జాతీయవాదులు ప్రపంచ చరిత్రల ఆవశ్యకతనీ, వివిధరాజకీయ సిద్ధాంతాలు తెలుసుకోవలసిన ప్రాముఖ్యతనీ — పాపం! — తెలుసుకోక సాహిత్యంలోకూడా తమ జాతీయతని ప్రకటించుకుంటున్నారు.

వారి సంకుచితదృష్టికి ప్రపంచచరిత్రలో భారతీయత_ఆంధ్రిత్వం_కనపడలేదంటే అది ప్రపంచలోపమూ కాదు. మాలోప మూకాదు.

కాని...

ఇంతమాత్రంతో మా బాధ్యతా పూర్తికాలేదు. ఆంధ్రిలోకం అనుగ్రహిస్తే-ప్రత్యేకంగా ప్రభుత్వం అనుగ్రహిస్తే-ఇంతకంటె ఎక్కువగా మాకార్యక్రమాన్ని నిర్వహించగలం. ఆ విషయంలో ఆంధ్రులుమట్టుకయినా మాతో సహకారం చేయగలరని ఆశ.

—సంపాదకుడు.

# క్రొపాట్కిన్ జీవితము.

ప్రిన్స్ పీటర్ అలెక్జీవిచ్ క్రొపాట్కిన్ 1842 డిసెంబరు 9 దో తేదీని మాస్కో నగరంలో, 'రూరిక్' అనే సుప్రసిద్ధ జమీందారీ కుటుంబంలో జన్మించేడు. ఆ రోజుల్లో రష్యాదేశం, నిరంకుశ చక్రవర్తి మొదటి నికోలస్ యొక్క దుష్పరిపాలన క్రింద నలిగి పోతూంది.

దేశంలోని భూమి, అడవులు అన్నీకూడా కొద్ది వందలమంది జమీందార్లకు చెంది వుండేవి. అత్యధిక సంఖ్యాకులగు ప్రజలు రైతులు గానూ, దాసులుగానూ, కూలీలుగానూ వుండి, జమీందారుల అత్యాచారాలతో నలిగి నాశనమై పోతూండేవాళ్లు. వాళ్లల్లో దారిద్ర్యము, అజ్ఞానం, రోగాలు వ్యాపించి, ప్రజాజీవితాన్ని గాఢాంధకార మయంగా చేసి వైచి నాయి. వాళ్లకు యెల్లాంటి పౌరసత్వహక్కులూ లేవు. మూఢవిశ్వాసాల్లో మునిగి మతాధికారుల దోపిడీకి గురియౌతూండేవాళ్లు.

జమీందారీ కుటుంబాల్లోని యువకులు చదువుకొని పెద్ద ఉద్యోగులుగానూ, సైన్యాధికారులుగానూ వచ్చి, నిరంకుశ విధానానికి అవలంబంగావుంటూ, ప్రజలపై తమ దౌర్జన్యాన్ని నిరాటంకంగా కొనసాగించు

తూవుండేవారు. అల్లాంటి జమీందారీ కుటుంబాల్లో బహు సుప్రసిద్ధమైన దానిలో పుట్టిన క్రొపాట్కిన్‌కు జమీందార్లు చేసే అత్యాచారాలు, దౌష్ట్య ములు, దోపిడీ, వాళ్లు గడపే అవినీతికరమైన సోమరిజీవితం, వాళ్ల ఆడంబరం, మొదలైన వాట్లను తెలుసుకోడానికీ; రైతులు, దాసులు, సేవకులు, యితర బీదప్రజలు భరించే అవమానాలు, దారుణశిక్షలు. దౌర్జ న్యములు. అత్యాచారాలు, అమానుషకృత్యాలు, స్వయంగా గమనించడా నికెన్నో వీలు కలిగింది. మానవులలోని యీ రెండు వర్గాల జీవితవిధా నాలూ క్రొపాట్కిన్‌లో గొప్ప జిజ్ఞాసాదృష్టిని కలిగించి, పీడితప్రజాసా మాన్యానికై ప్రాణాల్ని కూడా తృణప్రాయాలుగా పరిగణించేటట్లు చేసింది.

చిన్నతనంలోని ఒక్క సంఘటన మాత్రం అతడెప్పుడూ మరిచి పోలేదు. క్రొపాట్కిన్ యెనిమిదేండ్ల వాడై యున్నప్పుడు, ఒక రోజున ఆతని తండ్రి కోపోద్దీపితుడై యింట్లోని బానిసలపై మండి పడ నారంభించెను. అతని కోపమంతా 'మాకర్' అనే బానిస మీదికి తిరిగింది. 'వీణ్ణి నూరు దెబ్బలు కొట్టు' మని చీటి వ్రాసి, మాకర్ చేతికిచ్చి పోలీసుస్టేషన్‌కు పంపించేడు. ఇదంతా చూస్తూన్న క్రొపా ట్కిన్ జరుగుతూన్న విషయాన్ని గ్రహించేడు. అతని మనస్సు లజ్జా భయాలతో నిండి పోయింది. తండ్రి చేసిన పనికి లజ్జ; మాకర్ అమా నుషంగా శిక్షింపబడుతూన్నాడని భయం. చేసేదేమీ లేక, కండ్లనీరు గుక్కుకుంటూ, మాకర్ నివసించే చీకటి కొట్టులోకి వెళ్ళి, అతని రాకకై నిరీక్షిస్తూ కూర్చున్నాడు. మధ్యాహ్నం తిరిగి పోయేటప్పటికి మాకర్ తిరిగివచ్చి ఆ చీకటికొట్టులో ప్రవేశించేడు. అతని రెండు చేతులూ రక్తాలు కారిపోతూ, కండలు వ్రేలాడుతూన్నాయి. శరీరమంతా శవికి పోయివుంది. కళ్లు చింతనిప్పుల్లా వున్నాయి. గడ గడా వణకుతూ

గదిలోకి ప్రవేశించడం తడవుగా క్రొపాట్కిన్ అతణ్ణి సమీపించి చెయ్యి పట్టుకుని ముద్దుపెట్టుకో బోయేడు. మాకర్ చెయ్యి విదిలించుకుని రోషంతో "నన్నొదిలి పెట్టు. ఒంటరిగా కూచుని యేడవడానికైనా అడ్డురాకు. పెద్దవాడవైతే నీ తండ్రి చేసిన పనే నువ్వూ చేస్తావు." క్రొపాట్కిన్ క్రుంగి పోయేడు: "మాకర్! క్షమించు. నే నెప్పుడూ అల్లా ప్రవర్తించను. నా కోసం మా తండ్రిని క్షమించవూ?" అంటూ గద్గదికతో మాకర్ చేతులు ముద్దెట్టు కున్నాడు.

ఈతడు పదిహేనో యేటనే పీటర్స్‌బర్గ్ లోని యింపీరియల్ కోర్టులో చక్రవర్తి పరివారంలో చేరేదు. ధనవంతుల యెడల యేవగింపు యిక్కడే యితడిలో కలిగింది. 1862 లో కోసక్ రెజిమెంట్లతో సైబీరియాకు వెళ్ళి, భూగోళశాస్త్ర పరిశోధనలు చేసేడు. 1871 లో ఫిన్‌లాండ్, స్వీడన్ దేశాల్లోని గ్లేషియల్-డిపోజిట్లను కనిపెట్టి భూగోళశాస్త్రానికి వన్నె పెచ్చేడు. 1872 లో స్విట్జర్లాండు వెళ్లేడు.

ఈలోగా రష్యాలో మొదటి నికోలస్ చక్రవర్తి చనిపోయి రెండో అలగ్జాండర్ సింహాసనం యెక్కేడు. దాసత్వపద్ధతి తొలగించాలనే తీవ్రాందోళనకు ఫలితంగా (పెట్టుబడిదారీవిధానం అప్పుడే బయలుదేరి వృద్ధి బొందుతూంది. ఈ దాసత్వ విధానం పెట్టుబడిదారీ సమాజాభివృద్ధికి భంగకరం అవడం చేత పెట్టుబడిదార్లు కూడా దాసత్వ పద్ధతి తొలగించాలనే ఆందోళనకు ప్రోత్సాహం కలిగించేరు.) దాసత్వ పద్ధతి తొలగించబడింది; కొద్ది సంస్కారణలు యివ్వబడినాయి. సంస్కారణాలకు వ్యతిరేకంగా జమీందార్లు పెద్ద ఆందోళన లేవదీయడంతో వాళ్ళ ఒత్తిడికి లొంగిపోయి జారుచక్రవర్తి అధికారాన్నంతనూ ట్రిపోవ్, షువలోవ్‌ల చేతుల్లో పెట్టేడు. పోలీసుల నిరంకుశ పరిపాలన ప్రారంభించింది.

వేలకొలది యువతీ యువకు లురి తీయబడ్డారు; లక్షలకొద్దీ మంది సైబీరియాకు ప్రవాసం పంపబడ్డారు. మరెందరో జైళ్ళలో రాతి గోడలమధ్య కుర్సింగి పోతూన్నారు. కాని యెంతకీ అణగని మహా విప్లవశక్తితో రష్యా కంపించిపోతూంది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని ప్రబోధించే విప్లవ వాఙ్మయం దేశమంతటా మూల మూలలకు వ్యాపించింది. ప్రజల్లో విప్లవ చైతన్యం కలిగింది. దీనికంతకీ నాయకుడు 'బొరోడిన్.' అతని కోసం ప్రభుత్వ గూఢచారిదళం రష్యా అంతా గాలింవేస్తూంది. 'చకొస్కీ' 'స్టెప్నియాక్' లిద్దరూ యితని ముఖ్య సహాయులని ప్రభుత్వం అంచనా వేసి, వీళ్లని ముగ్గుర్నీ పట్టుకుంటే విప్లవాగ్నిని ఆర్పివెయ్యగలమని ప్రగల్భాలు సాగించింది. బొరోడిన్ తరచుగా నేత పనివాళ్లలోనే పనిచేస్తూంటాడని అందరూ అనుకునే వాళ్లు. అమాయికులగు కార్మికుల్ని యెందర్నో పట్టుకుని నిర్బంధించి, దారుణ హింసల పాల్జేసినా, బొరోడిన్ జాడ ప్రభుత్వం పట్టుకోలేక పోయింది.

కాలం గడిచి పోతూంది. 1874 సంవత్సర వసంతకాలంలో ఒకనాటి సాయంకాలం పీటర్స్ బర్గ్‌లోని 'ఇంపీరియల్ జాగ్రాఫికల్ సొసైటీ' భవనంలో పెద్ద సభ జరుగుతూంది. రష్యాలోని శాస్త్రజ్ఞులంతా అక్కడే వున్నారు. ప్రిన్స్ క్రొపాట్కిన్ యీ సొసైటీ కార్యదర్శి. ఫిన్లాండులో భూగర్భపరిశోధన చేసిన ఫలితాల్ని ఆలోజిన సభలో ఉపన్యాసం యిస్తాడు. రష్యాలో జల ప్రళయ కాల నిర్ణయాన్ని గురించి అనేక నూతన విషయాలీ పరిశోధనవల్ల వెల్లడి అయేయి. ఎక్కడ చూసినా యితని అద్భుత ప్రతిభను పొగడేవాళ్లే. గణితశాస్త్రంలో నిధి; భూగర్భశాస్త్రంలో నూతన విషయాల్నె కని పెట్టేడు; చిత్రకళ, గానం, వీటిల్లో కూడా యీతనికి ప్రవేశంవుంది; కవి; పదేళ్ల ప్రాయాన్నే నవ

లలు రచించేడు; వేదాంతశాస్త్రంలో దిగ్గంతి; యిరవైభాషల్లో మంచి
పాండిత్యం వుంది; ఏడు భాషల్లో మంచినీళ్ళ ప్రాయంగా మాట్లాడతాడు
చిన్న వయసులోనే రష్యాకంతకూ శిరోభూషణం అనిపించుకున్నాడు
సైన్యాల్లో నిర్బంధంగా ప్రవేశించవలసి వచ్చినప్పుడు, సైన్యాల్లో చేరి
సైబీరియా వెళ్ళేడు. అక్కడ యెన్నో సంస్కరణలు ప్రవేశపెట్టేడు.
ప్రభుత్వ విధానంలోనూ, సైన్యాల్లోనూ సంస్కరణలు ప్రవేశపెట్టడం
వల్ల లాభం లేదని గ్రహించేడు. కష్టనిష్ఠురాల కోర్చి పర్వతాల మీదుగా,
నదులమీదుగా దీర్ఘ ప్రయాణాలు చేసి చేసి అనేక నూతన విషయాల్ని పరి
శోధించేడు. ఆసియాఖండాన్ని గురించీ, దాని భూగోళాన్ని గురించీ
అంతవరకూ వున్న అభిప్రాయాల్ని తుడిచిపెట్టి నూతన విషయాల్ని బైట
పెట్టి, 'హంబోల్టు' వగైరాల సిద్ధాంతాలు తప్పని ఋజువు చేసేడు.

ఇన్ని అద్భుత కార్యాల్ని యింత చిన్న వయస్సులోనే నిర్వ
హించిన క్రొపాట్కిన్, ఆ నాటి సాయంకాలపు సభలో ప్రసంగించి
సభ్యుల మెప్పులు నందుకున్నాడు. రష్యన్ భూగర్భశాస్త్రజ్ఞుల్లో అగ్రగ
ణ్యుడగు 'వార్బట్-డీ-మార్నే' యితని అద్భుత ప్రతిభను పొగ
డుతూ దీర్ఘోపన్యాసం యిచ్చేడు. పాతిక భూగోళశాఖకు క్రొపాట్కిన్
అధ్యక్షుడుగా యెన్నుకోబడిన తర్వాత నాటి సభ ముగిసింది.

క్రొపాట్కిన్ బండిమీద బయలుదేరి యింటికి పోతూన్నాడు.
కొంత దూరం పోయేటప్పటికి యింకో బండి మహా వేగంగా యెదురొస్తుంది.
దాంట్లోంచి హఠాత్తుగా నేతపని వాడొకడు తల పైకిపెట్టి ప్రేమపూర్వ
కంగా కామ్రేడ్ బొరోడిన్! అని పిలిచేడు. ప్రిన్స్ క్రొపాట్కిన్, కాదు
కామ్రేడ్ బొరోడిన్ బండి ఆపించేడు. నేత పనివాడి బండీ ఆగి, అతడూ
గివచ్చేడు. వాడి వెనకనే ఒక గూఢచారి దిగివస్తూనే,——

" మిస్టర్ బొరోడిన్, ప్రిన్స్ క్రొపాట్కిన్, నిన్ను అరెస్టుచేస్తున్నాను."

అన్నాడు. చుట్టుప్రక్కలనుంచి పోలీసు పటాలం, నేలయీనినట్లు వచ్చి పడింది. ప్రతిఘటించడం వ్యర్థం అని తెలుసుకుని బొరోడిన్ లొంగిపోయేడు. అతన్ని బండిమీద యెక్కించి, గూఢచారీ, విశ్వాసఘాతకుడూ మరో బండిమీద పోయేరు.

విచారణ చేయకుండానే క్రొపాట్కిన్‌ను జైలుకు పంపేరు. ఘోరహింసలకు పేరు పడిన ' పీటర్ అండ్ పాల్ ' దుర్గంలోనే అతణ్ణి వుంచేరు. రష్యాలోని దేశభక్తులు, స్వార్థత్యాగులు, స్వాతంత్ర్యోపాసకులు, మానవోత్తములు,—— వీళ్లందరి నిర్బంధ జీవితాల చరిత్రే యీ జైలు చరిత్ర. ఈ జైలులోని రాతి కొట్లలో బడి ఎందరో దేశభక్తులు, రాజకీయ ధురంధురులు తమ ఉజ్జ్వల జీవితాల్ని చాలించేరు; మరెందరో పిచ్చివాళ్లై పోయేరు; చాలామంది భయంకర వ్యాధిపీడితులై కృశించి, కృశించి మరణించేరు. మహా మేధావులూ, ఉత్తమ మానవులూ, కోటి మానవుల కష్టాల్ని తొలగించ పూనుకొన్న విశాలహృదయులూ అని తెలిసి కూడా తమ వర్గంయొక్క లాభాలకై వాళ్లందర్నీ బలి చేయడానికి యీ ప్రభుత్వాలు వెనుకంజ వేయవు!

రెండు సంవత్సరాలు గడిచినా క్రొపాట్కిన్‌ను విచారణ చేసే రోజు రాలేదు. విచారణ చేయడానికి నేరమేదైనా వుంటేనా? ఈ రెండు సంవత్సరాలూ క్రొపాట్కిన్ మనుష్యస్వరమే వినలేదు. పక్క కొట్లలో వున్న నిర్బంధితులతో కొన్ని సంకేతాలేర్పరచుకుని, ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపుతూండేవాడు. శరీర పరిశ్రమకై తన కొట్టులోనే యిటూ అటూ వెయ్యిసార్లు పచారు చేసే వాడుట! కూర్చొనే ముక్కాలి పీటతో

డ్రిల్లు చేస్తూండే వాడు. ఇతని అన్నగారు ప్రిన్సు అలెగ్జాండర్ యొక్క భగీరథ ప్రయత్నాలవల్ల వ్రాత పరికరాలు లభించేయి. వాటి సహాయం వల్లనే 'హిమయుగాన్ని' గూర్చి తన అమూల్య సిద్ధాంతాల్ని పూర్తిచేసి లోకానికిచ్చేడు. క్రొపాట్కిన్ సంగీత ప్రియుడే. కాని పాడుకోడానికి అనుమతి దొరకలేదు. క్రమంగా పాటల్లో అభిలాష తగ్గిపోయి. తన స్వరమే ఎట్లా వుంటుందో మరిచి పోయేడు. ఆ తర్వాత లోకానికి అతడి పాట వినబడనే లేదు!

మూడోయేట జైల్లో అతడికి రోగం పట్టింది. అతణ్ణి మిలిటరీ జైలు హాస్పిటల్‌కు తీసుకుపోయేరు. కొంత స్వస్థత కలిగిన తర్వాత జైలు చుట్టూవున్న పువ్వుల తోటలో తిరగడానికి [illegible] అనుజ్ఞ యిచ్చేరు. ప్రభుత్వం, ఆ సమయంలో కూడా అతని చుట్టూ సాయుధులైన పోలీసులు పహారా యిస్తూనే వుండాలి.

ఎట్లాగైనా తప్పించుకు పారిపోవాలని క్రొపాట్కిన్ ప్రయత్నాలు సాగించేడు. అతడో వుపాయాన్నూహించి, స్నేహితులికి తెలియపరచేడు. ఒక రోజు సాయంకాలం పువ్వుల తోటలోకి షికారుగా వచ్చి, క్రొపాట్కిన్ గేటు సమీపంలో యిటూఅటూ పచారు చేస్తూన్నాడు. కట్టెలు తెస్తూన్న బండీల్ని లోపలికి రానివ్వడానికి గేటు తెరిచే వుంచేరు. ఇంతలోనే ఓ 'బాటసారి' వచ్చి వార్డరును పిలిచి, యేదో బాతాఖానీ కొడుతూన్నాడు. చల్లటి గాలి సాయంత్రపు ఎండలో వింత సుఖాన్నిస్తూ వీసుతూంది. చేరువనే యెక్కడినుంచో పిడేలు పాట వినిపిస్తూంది. ఆ సాయంకాల ప్రశాంతత నీ ధ్వని తప్ప వేరేదీ భంగపరచటం లేదు. తానూ సంసిద్ధుడుగా వున్నట్లు తెలియజేయడానికిలా వుంది. క్రొపాట్కిన్ తన టోపీని తీసి చేతుల్లో పట్టుకుని పచారు చేస్తూన్నాడు. పిడేలు మీది

పాట కూడా అంతకంతకి మరింత గతిలో పోతూ, పరుగెత్తమని వేగిర పెడుతూందా అనిపిస్తూంది. ఈ తరుణంలోనే మెరుపులా ఒక అశ్వ శకటం ఆ దారిని రావడం, ఒక్క పురుకున క్రోపాట్కిన్ దానిలో దూకడం, రెప్పపాటులో జరిగినాయి. శకటం రాజవీధుల్లో పోయి, ఒక పెద్ద హోటల్ ముందర ఆగింది. క్రోపాట్కిన్ హోటల్లో విందారగి స్తూంటే, పోలీసులు పీటర్స్‌బర్గ్‌లోని రహస్యప్రదేశాలూ, సందుగొందులూ అన్నిటినీ గాలించేసేరు. కృత్రిమ 'ప్యాస్‌పోర్టు' సహాయంతో క్రోపాట్కిన్ ఫిన్‌లాండ్‌కు తప్పించుకుపోయేడు. అక్కడినుంచి స్వీడన్ పిమ్మట తర్వాత యింగ్లాండుకూ పోయేడు. ఇల్లాంటి సాహసాలు ఆరోజుల్లో రష్యన్ విప్లవకారులు తరుచు చేస్తూనే వుండేవాళ్లు.

1879 సంవత్సరంలో ఫ్రాన్స్‌లోని 'లియాన్స్' నగరం చుట్టుప్రక్కల పారిశ్రామిక కేంద్రాల్లో అనార్కిస్టులు ప్రచారం ప్రారంభించేరు. దానిలో క్రోపాట్కిన్‌కు సంబంధం వుందని కొందరి అనుమానం.

1881 లో స్విట్జర్లాండునుంచి 'లా- రివోల్టీ' అనే పత్రికను క్రోపాట్కిన్ నడిపేడు. ఆ రోజుల్లో గడియారాల పరిశ్రమలో మాంద్యంవల్ల ప్రజలు చాలా బాధలు పడ్డారు. కార్మికుల్లో చైతన్యం కలిగించడానికి క్రోపాట్కిన్ బ్రహ్మాండమైన ప్రచారం సాగించేడు. ఎంతో యత్నించి రష్యా ప్రభుత్వం క్రోపాట్కిన్‌ను స్విట్జర్లాండునుంచి తరిమి వేయించగలిగింది. అసలు లోకంలోనుంచే తొలగించాలని అనుకుంది. కాని ప్రపంచ విఖ్యాతుడైన యీతని కొరకు ఆందోళన జరుగుతుందని భయపడి వూరుకొంది.

1882 లో లియాన్స్ నగరం దగ్గర 'మాంటె స్యూ- లెస్' గనుల్లోని కార్మికులు తిరుగుబాట్లు లేవదీసేరు. వాటిల్లో బాంబులు కూడా

వుపయోగించబడినాయి. ఇవన్నీ రష్యా ప్రభుత్వపు యేజంట్లే ప్రేరే పించేరని ఘదంతులున్నాయి. సమ్మెల్ని చెడగొట్టడానికే, కార్మికులు దౌర్జన్యం చేస్తూన్నారనడానికే ప్రభుత్వపు యేజంట్లే సమ్మెల్లో కొందరు దుండగీళ్లను ప్రేరేపించి అల్లర్లు చేయించడం, శాంతిరక్షణ పేరు చెప్పి కార్మికుల్ని కాల్చడం, ఘోరశిక్షలు విధించడం మనకూ మామూలే అయిం దిప్పుడు. వెంటనే ఫ్రెంచి ప్రభుత్వం అర్జెంటు ఆరుగురిని యెరస్టు చేసి కేసులు పెట్టింది. వీళ్లందరూ ' అనార్కిస్టు సంఘం ' గా వున్నారని వీరిమీది నేరం. ఆ సమయంలో క్రొపాట్కిన్ లండన్‌లో వున్నాడు. తర్వాత కొద్ది దినాలకే అతడు ఫ్రాంసు దేశానికి వెళ్లినప్పుడు ఫ్రెంచి ప్రభుత్వం అతన్ని యెరస్టుచేసి, విచారణసల్పి, 5 సంవత్సరాల శిక్ష విధించింది. క్రొపాట్కిన్ తన కేసును తానే ' డిఫెండు ' చేసు కొన్నాడు. రష్యా ప్రభుత్వం యిక్కడే తన తెలివి తక్కువను బయట బెట్టుకొంది. ఈ కేసులో పని చేసి, క్రొపాట్కిన్‌ను శిక్షించడానికి తోడ్ప డిన వాళ్లందరికీ రష్యా ప్రభుత్వం పెద్ద బహుమానాలూ, బిరుదులూ, యిచ్చింది. దానితో యూరోపులో అంతటా సంచలనం బయలు దేరింది. రష్యా ప్రభుత్వానికి తృప్తి కలిగించడానికి క్రొపాట్కిన్‌ను జైలులో వుంచ డం న్యాయమా? పార్లమెంటులో ప్రశ్నల వర్షం కురిపించేరు, సభ్యులు. చిట్టచివరకి ' కొన్ని రాజకీయ కారణాలవల్ల క్రొపాట్కిన్‌ను వదలడానికి వీల్లేద ' ని ప్రభుత్వం జవాబిచ్చింది. ప్రజల్లో ఆందోళన పెచ్చుపెరిగింది. ఆఖరుకు క్రొపాట్కిన్ 1886 లో వదిలివేయబడ్డాడు. అప్పటికి ఆతడి శిక్ష మూడేళ్లు గడిచింది. ఈతవి విడుదల కారణంగా మాస్కోలోని ఫ్రెంచిరాయబారిని రష్యన్ ప్రభుత్వం అగౌరవపరచడంవల్ల ఆతడు రాజీ నామా యిచ్చి, స్వదేశానికి వచ్చేసేడు.

జైలులో కూడా క్రొపాట్కిన్ కాలం వృధాచేయక, వ్యవసాయశాస్త్ర పరిశోధనలు సాగించేడు. ఆకృషి ఫలితమే " Fields-Factories and workshops " అనే గ్రంధము. అతని పరిశోధనలు వ్యవసాయశాస్త్రంలో విప్లవాన్ని తెచ్చేయనడంలో సందేహం లేదు.

విడుదల పొందిన తర్వాత క్రొపాట్కిన్ యింగ్లాండుకు తిరిగి వెళ్లి, 1917 వరకూ అక్కడే వుండిపోయేడు. 1887 లో 'రష్యన్, ఫ్రెంచి జైళ్లలో ' అనే గ్రంధాన్ని రచించేడు. అది ముద్రణలో వుండగా ఒక నాటి రాత్రి హఠాత్తుగా ఆ పబ్లిషింగ్ కంపెనీ, పుస్తకాల ప్రతులూ, అన్నీ మాయమై పోయేయి. ఆ పని చేయించినదెవరో ప్రపంచానికి వెల్లడి అయింది. కాని, ఎవరు ఏం చేయగలరు?

ఇతడు ఫస్టు యింటర్ నేషనల్ లో సభ్యుడు. 1917 లో బోల్షివిక్ విప్లవం విజయవంతం అయిన తర్వాత రష్యాకు పోయేడు. కాని ఆ ప్రభుత్వంలోని ' అధికార కేంద్రీకరణ సిద్ధాంతం ' యితనికి యిష్టం లేకపోవడంచేత రాజకీయాల్లో పాల్గోక, తన జీవితశేషాన్నంతా యేకాంతవాసంలో గడిపి, 1921 ఫిబ్రివరి 8 వ తేదీనే మరణించేడు.

' అనార్కిజమ్ ' కు యితడే మూల పురుషుడు. అంతర్జాతీయ సంబంధాలులేని సామాజిక వ్యవస్థని స్థాపించాలనీ; విద్యాలయాలూ, ఆరోగ్య సంస్థలూ, అవసరంలేవనీ; ఆధునిక రహదారీ మార్గాలు తీసేసి, అధికారకేంద్రీకరణానికి అవకాశం లేకుండా చేయాలనీ; విదేశ వ్యాపారాలు చేయనేకూడదనీ; విద్యుచ్ఛక్తి అనవసరమనీ; కడకు వ్యవసాయం లోనైనా యంత్రసాధనా ఉపయోగించకుండా వుండాలనీ; అనార్కిష్టుల ముఖ్యసిద్ధాంతాలు. ఇవన్నీ వుంటే ' స్టేటు కాపిటాలిజమ్ ' అవుతుందేగాని ' సోషలిజమ్ ' కాదని అనార్కిష్టుల వాదన. ప్రస్తుత పెట్టుబ

డిదారీ రాజ్యాంగాన్ని వెంటనే నాశనంచేసి, ఒక్కసారిగా రాజ్యాంగయంత్రరహితమైన మానవ సమాజాన్ని యేర్పాటుచేయాలని వాళ్ల ఆశయం. ఈ విషయంలోనే అనార్కిస్టులకూ-కమ్యూనిస్టులకూ పూర్తిగా వ్యతిరేకం.

రాజకీయ సిద్ధాంతాల విషయం అట్లావుంచి, మానవ జాతిసంతనూ విజ్ఞాన పూరితమొనర్చాలనీ, స్వతంత్రమైనదిగా చేయాలనీ.- యీరెండు ముఖ్యోద్దేశముల కొరకూ తన యావజ్జీవితాన్నీ ధారపోసిన యీ మహాశయుడు చిరస్మరణీయుడే. వాటిని సఫలమొనరించే బాధ్యత ముందు వారిమీద పెట్టి ఆతడు మరణించేడు. ఈ ఆదర్శాలను పొందడానికి మానవ సంఘాన్ని ముందుకు గొనిపోవలసిన బాధ్యత యువకులదే.



# విప్లవ సందేశం.

సోదరులారా! నేను చెప్పబోయేది యువకులకు మాత్రమే. ఈ వ్యాసం యొక్క సంపూర్ణమైన అర్థాన్ని యువకులు మాత్రమే గ్రహించ గలుగుతారు. శరీరమందే గాక మానసికంగా కూడా వృద్ధాప్యాన్ని పొందిన వాళ్లు శ్రమ పడక యీ కరపత్రాన్ని క్రింద వుంచి వేయండి.

మీరు. జీవితంలోని ముఖ్యమైన సంధికాలంలో వున్నారు. ఒకరు ప్రకృతి శాస్త్రాలు, యింకొకరు తత్త్వశాస్త్రాలు, మరొకరు వైద్య శాస్త్రం, యింకొకరు తర్కశాస్త్రం, యిదీ అదీ యేమిటి, అందరూ తలొక విజ్ఞాన శాఖ యందునూ ప్రవృత్తులై. మానవ సంఘంయొక్క క్షేమాభివృద్ధులకై పాటు బడుతూ, మీ శక్తి యుక్తుల నన్నిటినీ లోకకల్యాణానికై ధారపోయాలని కూడ తలుస్తూ వుంటారు. కేవలమూ ధనార్జనా, కుటుంబపరత్వం, యివే మానవ జీవితానికి ఆదర్శాలనీ, సంకుచిత మైన వ్యక్తి సుఖమే పరమార్థమనీ తలంచే పశుప్రాయులకు నేను చెప్పేదేమీ వుండదు. జీవిత రంగంలో ప్రవేశింపబోతూన్న యీ యౌవ్వనావస్థలో

విప్లవ సందేశం.

మీ ఆశయాలు ఉన్నతాలు; మీ జీవితం ఆశా పూరితం; మీకు యుక్తా యుక్త వివేక జ్ఞానంతో పని చేయగల వయస్సు వచ్చింది. మీరు త్వరలోనే జీవితరంగంలో ప్రవేశించ బోతున్నారు. అనేక క్లిష్ట సమస్యలు మిమ్మల్ని ఎదుర్కొంటాయి. వాటిని మీరు యెల్లాగ ఎడదీయగలుగుతారో చూడాలిసివుంది.

మానవసంఘాన్ని ప్రస్తుతం యెదుర్కొంటూన్న సమస్యల్ని, అందులోనూ ముఖ్యంగా ఆర్థిక, సాంఘిక, రాజకీయ సమస్యల్ని పరిష్కరించి, మానవ సంఘాన్ని ఒకే ఒక విశ్వమానవ సంఘంగా, నిజమైన స్వాతంత్ర్యం, సమానత్వం, వీటిపై ఆధారపడియున్నదాన్నిగా చెయ్యాలంటే దానికి తగిన ధైర్యాన్ని మీరు వహించాలి.

ప్రస్తుతం మీకు యివ్వబడుతూన్నది విద్య గాదు. ఇది కాపిటలిస్టు ప్రభుత్వాల ప్రచారమే అని చెప్పాలి. ఈ విద్య. మానవుల్లో సంకుచితత్వాన్నీ, మోసాన్నీ, దోపిడీ మొదలైన దుర్గుణాల్నీ, ప్రేరేపించేదిగానే వుంది. మన బాహ్య ప్రవర్తనకీ హృదయ ప్రబోధాలకీ సామరస్యాన్ని కుదర్చడానికి వీల్లేకుండా వుంది. విశాలభావాలుండి మానవసేవ చేదామనుకొన్న వాళ్ళకి, యీ సంఘంలో తావు లేకుండా వుంది. ఇన్ని మాట లెందుకు? ప్రస్తుతానికి వద్దాం.

ఓ యువకుడా! నీవు చదువుతూన్నది వైద్యశాస్త్రమా? బాగున్నది. వైద్యవృత్తివల్ల అనేక మందికి సేవ చేయవచ్చు. బీదలకి వుచితంగా వైద్యసహాయం చేయడానికి వీలు వుంది. కేవలమూ ధనాకర్షణ మాత్రమే కాక మానవ సేవ చేయడం కూడా నీ కార్యక్రమంలో వుంది. భేష్! యువకుడా! నీ హృదయంలో దయకు స్థానం వుంది. నీవే నిజమైన యువకుడవు. కాని నీ ఆశలూ, ఆశయాలూ, యదార్థ జీవితంలో యెంతవరకూ నెరవేరుతాయో చూడాలి.

## విప్లవ సందేశం.

నీచదువు పూర్తి అయింది. డాక్టరు పరీక్షలో వుత్తీర్ణుడవైనావు. ప్రాక్టీసు ప్రారంభించేవు. ఈ సంఘాన్ని యెట్లాంటి పీడాకరములైన భ్రమలు ఆవరించి వున్నాయో అనుభవంవల్ల నువ్వు తెలుసుకోగలుగుతావు.

ఒక రోజున బీదవాడొకడు నీదగ్గరికి వస్తాడు. తనభార్య చాలా బాధపడుతూందనీ, ఒకసారి వచ్చి చూసి పొమ్మనీ, నిన్ను కోరుతాడు. దయ యనేది నీలో యింకా యింకి పోకుండడంచేత వాని కోరికను అంగీకరించి, వెంబడిస్తావు. పట్టణపు చివరకి పోయి పోయి, పేదజనులుండే సందు గొందులబడి పోతూంటావు. వీధులు చాలా యిరుకుగానూ, మురికిగానూ, దుర్గంధపూరితాలుగానూ వుండడంచేత మనుష్యులెట్లా యిక్కడ నివసిస్తున్నారా? అని ఆశ్చర్యపడతావు. చివరకి నీ వొక గుడిసెలో ప్రవేశించి, మధ్య వయస్సులో నున్న స్త్రీ నొకతెను చూస్తావు. ఆమె చాలా కృశించి వుంటుంది. ఒంటిమీద చాలీచాలని చింకిపీలికలు తప్ప మరేవీ వుండవు. ఇంటిలో వెలుతురుండదు. నేలంతా చెమ్మగా వుండి, దుమ్ము కొట్టాడుతూ వుంటుంది. ఒక పక్క శల్యామాత్రావశిష్టులైన ముగ్గురు పిల్లలు మురికి శరీరాలతో అటు నిటు బడి నిద్రబోతూంటారు. పాపం! ఆకలికి యేడ్చి యేడ్చి నిద్రబోయి వున్నారు కాబోలు! నిన్ను గొని పోయిన యాతడే గృహయజమాని. అతడొక మిల్లులో కూలీగా పని చేసేవాడు. కాని ఆరునెలల క్రిందటే అవసరం లేక కాబోలు మిల్లు యజమాను లాతనిని పనిలోనుండి తొలగించేరు. అప్పటినుంచీ యెన్ని ప్రయత్నాలు చేసినా ఆతనికి పనే దొరకలేదు. భార్య, నాలుగు నెలలదాకా సంపన్నుల యిళ్లల్లో చాకిరీ చేసి సంపాదించి తెచ్చే బేడ డబ్బులే ఆ కటిక దరిద్ర కుటుంబానికి ఆధారం! ప్రొద్దుగూకులూ, రెక్కలు ముక్కలయేటట్లు పనిచేయడం వల్లా, సరియైన ఆహారం

లేకపోవడం వల్లా, ఆమె అనారోగ్యపీడితురాలై వుండీకూడా, విధిలేక కూలికి పోతూండేది.

క్రమంగా రోగం యెక్కువై ఆమె మంచం పట్టింది. కాదు, కాదు. మంచం యెక్కడుంటుంది, యిల్లాంటి దరిద్రులకి? చాప బట్టిందనడమే యిల్లాంటి వాళ్ల విషయంలో సమంజసం. ఇక్కడికి నాలుగు రోజులనుంచి కాబోలు ఆ కుటుంబ మంతా పస్తు. తినడానికి తిండి లేదు. చేయడానికి పని దొరకదు. అల్లాంటి స్థితిలో మందులెక్కడనుంచి వస్తాయి. పోనీ, యిరుగు పొరుగు వాళ్లేమైనా సహాయం చేస్తా రేమో యనుకొన్నా, వాళ్లంతకన్నా నిస్సహాయస్థితిలో వున్నారు. ఎక్కడ చూచినా, వెల వెల పోయే ముఖాలతో, యెముకల పోగులైన చిన్న పిల్లలూ, దుర్వాసనా, చీకటీ, చెమ్మా, ఆకలీ, నిరుద్యోగమూ, దారిద్ర్యం, తాండవిస్తున్నాయి. అయ్యో! యెల్లాంటి దురవస్థ.

నీ ముఖంలో యేమాత్రమైనా సౌజన్యత కన్పిస్తే, పాపం ఆ అమాయికులు తమ కష్టసుఖాల్ని నీదగ్గిర వెళ్లబోసుకుంటారు. అప్పుడు వాళ్ళకి నీవేమి సలహా యిస్తావు. పరిశుభ్రంగా గాలీ, వెలుతురూ వున్న చోట్లల్లో వుండాలనీ, పుష్టికరమైన ఆహారం తీసుకోవాలనీ, విశ్రాంతి పొందాలనీ, ఇంకా యిల్లాంటివే కొన్నిటిని వాళ్ళకి చెపుతావు. అంతే కాదూ? కావి, యిల్లా చెప్పడం వాళ్ళ నవమాన పరచడం కాదా? అల్లా చేసుకోడానికి యేమాత్రం అవకాశం వున్నా వాళ్లు నీ సలహాకోసం యిన్నాళ్లు యెందుకు కనిపెట్టుకొని కూచుంటారు?

ఇంటికెళ్ళింతర్వాత కొన్ని రోజులవరకూ యీ దృశ్యమే నీ కళ్ళముందర ప్రత్యక్షమవుతూ నీకు బాధ కలిగిస్తూంటుంది. ఈ జనం అంతా యిల్లా బాధపడుతూ వుండడానికి కారణం యే దేవుని మీదో, కర్మ మీదో పారేసి రెండు తిట్టుకుని వూరుకుంటావు.

నీవు యిల్లాంటి దృశ్యాల కలవాటుపడి, అంతరాత్మను చంపు కొని వూరుకోవాలనుకుంటావు. కాని, నీ లోని విమర్శనాశక్తి నీకు తెలియకుండానే విజృంభించి, నీకు మాటి మాటికీ వీటిని జ్ఞాపకం చేస్తూంటుంది.

రోజులు గడిచిపోతూంటాయి. మరో రోజున ఒక ధనవంతుని యింట్లో ఒక రోగిని చూడడానికి ఆహ్వానించబడి, మోటారు మీద పోయి చూస్తావు. రోగి, యీ సందర్భంలో కూడా స్త్రీ యే. మిక్కిలీ బలిసి, కదలడానికి కూడా శక్తి లేక ఆయాసపడుతూంటుంది. పనంటే యేమిటో యెరక్క, విందులూ, వినోదాలూ, భోగాలూ, పశువులాంటి భర్తతో కాపురం. అంతే ఆమె జీవితంలో నిత్య దినచర్య. ఆమెకి నువ్వు చెప్పేదేమిటి? తేలికైన ఆహారం తీసికొంటూండాలనీ, యింద్రియలోలత్వం తగ్గించుకోవాలనీ, కొంచెంగా శరీర పరిశ్రమ చేస్తూండాలనీ, యిల్లాంటి నియమాలే కాదా?

ఇవే కాదా, నీవు చెప్పేది? బాగుంది. ఇప్పుడు నీకు సంఘంలోని పరిస్థితులు కొంతవరకూ అర్థం అయివుంటాయి. మానవసంఘంలో యెల్లాంటి మూర్ఖపు కట్టుబాట్లు పాతుకుపోయి పీడిస్తూన్నాయో, వాటిని తొలగించవలసిన అవసరం యెంత తీవ్రంగా వుందో యిప్పుడు నీకు తెలుస్తుంది.

ఒకతె, తన జీవిత కాలమంతట్లోనూ విశ్రాంతీ, సుఖమూ యెరక్క, కడుపునిండా తిండికూడా దొరక్క, నిత్య యాతనతో చనిపోతూంది. ఇంకొకతె, జీవితకాలమంతట్లోనూ, పనంటే యేమిటో యెరక్క, సోమరిపోతై, పీడితురాలై వుంటూంది.

మనలో చాలామంది యెల్లాంటి దారుణ విషయాలనైనా చూసీ చూడనట్లుగా వుంటూ, కాలం గడుపుకు పోతూంటారు. నీవు కూడా

అల్లాంటి దౌర్భాగ్యుల్లోనే చేరుతావా? శరీరంలోని రక్తాన్ని వుడుకెత్తించే యే భీభత్స దృశ్యాలనైనా పైశాచికకార్యాలనైనా చూస్తూ, నిట్టూర్పు విడుస్తూ, యిట్లాంటి వెన్నో చూసే 'మని సరిపుచ్చుకుంటూంటారు కొందరు. త్రాగో లేక పోతేవాళ్ల వినోదాల్లో యీ విప్లవ దృశ్యాల్ని మరుంచేసో, కాలం పుచ్చుతూంటారు. మరికొంతమంది ఇట్లా కొంతకాలం గడిచేటప్పటికి సంఘంలోని యిల్లాంటి విరుద్ధ దృశ్యాలకి మనం అలవాటు పడిపోతూంటాం. నీలోని పశుత్వం జయించి, స్వార్థం విజృంభిస్తుంది: విలాసాలతో కాలం గడిపేవాళ్ళతోనే తిరుగుతూ అట్టి జీవితాన్నే గడప డానికి కావలసిన సాధన సామగ్రిని సమకూర్చటానికే, నీ కాలమంతా వినియోగిస్తూంటావు. కాని, యిల్లాంటి దరిద్రుల్ని, చూడడమే కాదు సరిగదా అల్లాంటి వాళ్లు వున్నారని తలచడానికి కూడా ప్రయత్నించవు. కాని, ఓ సోదరా! నీయందే మానవత్వమున్నట్లయితే, నీ పుద్దేశ్యాలనన్నిటినీ క్రియా రూపంలో పెట్టగల ధైర్యశాలివైతే, నీలో పశుత్వంచేత మానవత్వం పూర్తిగా అణగద్రొక్కబడకుండా యింకా మిగిలి వున్నట్లైతే యింకోలా ప్రవర్తిస్తావు;

ఒక రోజున నీవు, "అబ్బే! యిది చాలా అన్యాయం. ఘోరాతి ఘోరం. ఈ పద్ధతిని కొనసాగనీయకూడదు. రోగాల్ని కుదర్చడమే ప్రాపంచిక సేవ కాజాలదు. ఇది చాలదు. వైద్యవృత్తిని కుక్కలు ముట్టుకు పోనీ. మానవ సేవను ప్రారంభించడం యిట్లా కాదు. మరెట్లాగ? ఆ! తెలిసింది! ఇల్లా అయితే! మంచి గాలీ, వెలుతురూ గల యిళ్లూ; పరిశుభ్రమై, పుష్టికరమైన ఆహారమూ, తక్కువ శ్రమ నిచ్చే పనీ; మానవావసరాలివే కదా. ఇవి అందరికి లభ్యమయేటట్లుగా సంఘాన్ని మార్చాలి. ఇల్లాకాకపోతే వైద్యుని వృత్తంతా మాయ, గారడీ, మోసం, కానీ,................................" అని తలుస్తూ యింటికి పోతావు.

ఆ రోజే సోషలిజం అంటే యేమిటో నీవు తెలుసుకోగలుగుతావు. అప్పుడే ఆవిధానాన్ని గూర్చి పూర్తిగా తెలుసుకొన గోరుతావు. పరోపకారం, మానవ సేవ యనేవి నీయభిప్రాయంలో వ్యర్థ ప్రలాపాలూ, పుస్తకములలో నుండిదగినవీ మాత్రమే కాకపోతే, ప్రకృతి శాస్త్రజ్ఞుల సిద్ధాంతాల్ని సాంఘిక కట్టుబాట్లకి జతపరచి పరిశీలనాదృష్టితో చదివినట్లైతే నాడే నీవు మాలో నొకడవై పోతావు. మాలాగే తీవ్రంగా పనిచేస్తూ కుళ్లిపోయిన యీ సంఘంయొక్క కట్లుబాట్లన్నిటినీ నిర్మూలించడానికై, సాంఘిక విప్లవాన్ని లేవదీయడానికి యత్నిస్తావు.

అదేమిటి? నీకు మళ్లీ మరొక సందేహం తోచిందా? "ఏమో ఇట్లాంటి కార్యాలు చాలా చేయవచ్చు........................కాని,............ నామట్టుకు నేను ఖగోళశాస్త్రంలోనో, వేదాంతశాస్త్రంలోనో, రసాయన శాస్త్రంలోనో, కృషి చేసుకుంటాను. దానివల్ల ప్రస్తుతం కాకపోయినా ముందు సంతతి వాళ్ళకైనా చాలా ఘనమైన శాస్త్రీయ విషయాలని తెలుపగలుగుతాను. ఇంతకంటె సంఘసేవ వేరేముంది?" అనేనా?

ఓస్సి! ఇదా నీ వూహ. మొట్టమొదట్లో శాస్త్రపఠనంవల్ల నీవు కోరేదేమిటో చూద్దాం. ఆ విజ్ఞానోపార్జనంవల్ల కలిగే ఆనందం, సంతృప్తి,- అంతేనా? సందేహం లేదు, ప్రకృతి రహస్యాల్ని పరిశీలించడంలోనూ, వాటిని భేదించడంలోనూ నీ బుద్ధిచాతుర్యం వుపయోగించడంవల్ల నీ కత్యధికానందం కలుగుతుందన్న మాట నిజమే కావచ్చు. అంతే అయితే తన ఆత్మానందంకోసం శాస్త్రీయచర్చలలో మునిగి తేలుతూన్న వేదాంతికీ, కల్లు త్రాగడంచేత కలిగే తాత్కాలికానందంచేత మైమరచి చెట్టుక్రింద పడివున్న త్రాగుబోతుకీ భేదం యెందులో వుంది? ఎటొచ్చీ వేందాతికి యే రవ్వా, రట్టూ వుండదు. త్రాగుబోతుకంటె కొంచెం తెలివైన వాడు. యెంచేతంటే, అతనికంటే యెక్కువ ఆనందాన్ని, చాలా

కాలంవరకూ వుండేదాన్ని యేరుకున్నాడు. అంతే గాదామరి? ఇద్దరికీ కూడా తాత్కాలిక సంతృప్తి, స్వసుఖం, ఆనందం, ప్రపంచంలో యిత రులింకా వున్నారనే విషయం మరువగల్గడం,-యివే కాదా కావలసినవి?

కాని,— ఓ యువకుడా! నీకిట్టి నీచమైన స్వార్థజీవితాన్ని గడపడానికి యిష్టంలేదు కాదా? పైపెచ్చు శాస్త్ర చర్చల్లో కాలం గడుపు టకు కోరుతూన్నది, తోటి మానవు● సేవకేకాదా? మానవాభ్యుదయము నకేగాదా? ఇట్టి విశాలాభిప్రాయాలతో కేగాదా, నీవు శాస్త్ర పఠనంలోనూ శాస్త్రీయ చర్చల్లోనూ మునిగి తేలుతూన్నది!

ఎంత దూరదృష్టి! ఎంత విశాలాభిప్రాయాలు! కాని ఒక్కటే సందేహం. మొదట్లో ప్రారంభించేటప్పుడు మన వాళ్లల్లో యిల్లా అను కోనివాడొక్కడేనా వున్నాడా? తర్వాత, యథార్థ జీవితంలో వాళ్ల వూహలెంతవరకూ సఫలమౌతూన్నాయి? అనే నా సందేహం.

ఇంకో సంగతి తటాలున స్ఫురిస్తూంది. నీకు మానవ సంఘం యొక్క మంచే కావలిసివస్తే, తోడి మానవులకు సేవ చేయడమే నీ వుద్దే శ్యమైతే, వెంటనే యీ ప్రశ్న వచ్చి తీరుతుంది. నీలో విమర్శనాజ్ఞానం యెంత యెక్కువగా వుండనీ, యీ విషయం నీకు స్ఫురించకుండా పోదు. ప్రస్తుత మానవ సంఘంలో ప్రకృతి శాస్త్రాలు భోగానుభవానికే పనికి వస్తూన్నాయి. కొద్దిమందికి జీవితాన్నధిక సుఖకరంగానూ, చాలామందికి బాధాకరంగాను, భారంగానూ చేస్తూన్నాయి. మొత్తంమీద శాస్త్రీయ జ్ఞానం; మానవుల్లో చాలామందికి అందనిమ్రానిపండే అయింది.

ఈ విశాల విశ్వాన్ని గురించీ, దాని పరిణామాభివృద్ధుల్ని గురించీ, శాస్త్రజ్ఞులు తమ దృఢాభిప్రాయాల్ని వ్యక్తీకరించి నూరు సంవ త్సరాలు దాటిందే! కాని, యీ విషయాలు తెలిసిన వాళ్లెందరున్నారు? నిజమైన విమర్శనా దృష్టితో యీ విషయాన్నుపలక్షించిన వారెంతమంది?

కొద్దిమంది మాత్రమే. కొన్ని వందల కోట్ల మానవుల్లో, యేకొద్దిమంది మాత్రమో! మిగిలిన వాళ్లంతా మూఢాచారాల్లోనూ, అసూయా ద్వేషాల్లోనూ, మునిగి, ఆటవికులకన్న హీనస్థితిలో నున్నారే! మతం పేరు చెప్పి ప్రపంచాన్ని మోసంచేసే వాళ్ళమాటలకి లోబడి వీళ్ళంతా యే రాక్షస కృత్యాన్నైనా చేయడానికి సిద్ధమే!

ఇంకో అడుగు ముందుకు పదండి. ప్రజాసంఘంయొక్క శారీరక, మానసికాభివృద్ధులకి ప్రకృతి శాస్త్రం యేం వుపకరించింది? శాస్త్రాలు చెపుతూనే వున్నాయి, మన శరీరాల నారోగ్యంగా యెట్లా వుంచుకోవాలో, సంఘాన్ని మంచిస్థితిలో యెట్లా నడపాలో మొదలైన వాట్లని గురించి. కాని, అనుభవంవల్ల తెలియడంలేదూ, యీ మాటలు పుస్తకాల్లో మాత్రమే వున్నాయనీ, ప్రజలకి వుపయోగంలోకి రావడం లేదనీ! మన కీసంగతి తెలియక పోలేదు. కాని, యిల్లా యెందువల్ల జరుగుతూంది?.................. ఎందువల్లనా? ........... శాస్త్రజ్ఞానం మానవుల్లో కొన్ని సౌకర్యాలు కలిగివున్న వాళ్ళకే అందుబాట్లో వుందిగనక; సాంఘిక భేదం మానవుల్ని రెండు వర్గాలుగా, కూలికి పనిచేసే బానిసలూ, దోచుకొనే పెట్టుబడిదార్లూ,—అనే రెండు విభాగాలక్రింద చీల్చివేసి, తొంభ్భైదిపంతుల జనానికి విజ్ఞానాన్నే గాక జీవితావసరాల్ని కూడా అందుబాటులో లేకుండా చేసింది గనక.

కావలిస్తే యెన్ని వుదాహరణాలనైనా చూపించవచ్చు. కాని, ఒక్కటి చాలదూ! చూడండి! అదిగో! పెద్ద పుస్తకభాండాగారం! ఎన్ని బీరువాలు! ఎన్ని పుస్తకాలు! కాని లోపలికి పోవడానికి యే కొద్ది మందికో మాత్రమే వీలుంది. పోనీ, ఆ వెళ్లిన వాళ్ళైనా యేం సుఖంగా వున్నారు. కిటికీల అద్దాలన్నీ దుమ్ముకొట్లాడుతూండడం వల్ల సూర్యరశ్మి చొరటానికి వీలు లేకుండా వుంది. ఒక్కొక్కడుగు వేస్తూ

న్నికొద్దీ యీ అనుభవం బలపడుతూంది. ప్రపంచంలో ప్రస్తుత సాంఘిక వ్యవస్థకూడా యిట్లాగే వుంది. ఒక్కసారి ఆలోచించి చూడండి!

ప్రస్తుతం మనం కొత్తగా శాస్త్రీయ విషయాల్ని చెప్పించి, కొత్త పరిశోధనల్ని చేస్తూండడమే మన కర్తవ్యం కాదు. చేయవలసిందల్లా, కనిపెట్టబడిన యీ సత్యాల్ని బాగా ప్రచారం చేయడం, మానవుని నిత్యజీవితంతో వాటిని మేళవింపజేయడం, వాటియందు మానవులందరికీ సమాన హక్కులూ, సమాన అనుభవం వుండేటట్లుగా చేయడం; మానవ సంఘమంతా యీ పరిశోధనా ఫలితాల్ని అనుభవించేటట్లు మనం యీ సంఘవిధానాన్ని, పరిస్థితుల్ని మార్చాలి. అప్పుడే శాస్త్రాలు, యేకొద్ది మందికో భోగవస్తువులుగా, స్వత్వములుగా వుండడం మానేసి, మానవుని నిత్యజీవితాన్ని సౌకర్యయుతంగానూ, సౌఖ్యవంతంగానూ చేయగలుగుతాయి. పరిపూర్ణోత్కృష్టమైన న్యాయం దీనినే కోరుతూంది.

ఇంతేగాదు. కనిపెట్టబడిన నూతన పరిశోధనా ఫలితాలని ఆచరణలో పెట్టగల స్థితిలో సంఘం వున్నప్పుడే శాస్త్రాలు నిజంగా అభివృద్ధి పొందగలుగుతాయి. యంత్రమూలకంగా వేడిని కలుగచేయవచ్చునసే సిద్ధాంతం విషయం (The Theory of the Machanical Origin of Heat.) చూడండి. ఈరోజున హారన్, క్లాషియస్‌లు సూత్రీకరించినట్లే, ఒక శతాబ్దానికి పూర్వమే యీసిద్ధాంతాలు కనిపెట్టబడినాయి. కాని ఎన్నభై సంవత్సరాల వరకూ యివన్నీ విశ్వ విద్యాలయపు రికార్డుల్లోనే అస్తమించిపోయినాయి. కడపటికి శాస్త్రజ్ఞానం అభివృద్ధిపొంది సంఘం వాటిని గ్రహింపగలుగు స్థితిలోకి వచ్చింతరువాతనే వాటిని బూజు దులిపి పైకి తీశారు. ఎరాస్మస్ డార్విన్ మహాశయుని పరిణామవాదం మూడు తరాలవరకూ మూలబడి వుండి వుండి, తర్వాత అతని మనుమని వద్దనుండి విశ్వ విద్యాలయ పండితులచేత స్వీకరించబడింది. అదేనా

ఎప్పుడనుకున్నారు? ప్రజలనుండి బాగా ఒత్తిడి కలిగిన తర్వాతనే! కవి, చిత్రకారుడు, మొదలైనవారివలె వేదాంతులు, శాస్త్రవేత్తలూ కూడా తమ కాలంలోని సంఘంనుండి జనించిన వారే. కావున ఉత్తమ పరిణామాన్ని కోరేవాళ్లు ముందుగా సంఘాన్ని సంస్కరించాలని యిప్పుడైనా ఒప్పుకోరా?

కాని, నీ వీవూహాలతో నిండి వున్నట్లైతే, ప్రస్తుత పరిస్థితుల్లో సంపూర్ణమైన విప్లవాన్ని తేవడం తప్పదని తోచక మానదు. ప్రస్తుత పరిస్థితుల్లో శాస్త్రజ్ఞులు శాస్త్రీయ విషయాలతో తలలు బద్దలు చేసికోవలసి వస్తూంది. మిగిలిన జనసామాన్యమంటేనో, అది పది, యిరవై శతాబ్దాల క్రిందటి అజ్ఞానస్థితిలోనే గాఢాంధకారంలోనే వుండిపోతూంది. వెల్లడిచేయబడిన శాస్త్రీయ సత్యాలనే నమ్మజాలని మూఢులై కేవలం బానిసలుగానూ. వస్తునిర్మాణంచేసే యంత్రాలుగానూ, మాత్రమే వుంటున్నారు. నీ వేరోజున విశాలమై, అగాధమైన శాస్త్రీయ సత్యాలని సంపూర్ణంగా తెలుసుకోగలుగుతావో ఆ రోజునే శాస్త్రపరిశోధనలతో కాలం గడపవలెననే కోరిక తగ్గిపోతుంది. కేవలం గ్రహింపబడిన శాస్త్ర విషయాల్ని మానవ సంఘమంతా పూర్తిగా అనుభవించేటట్లు చేయడానికై సాంఘిక విప్లవాన్ని లేవదీయడానికై యత్నిస్తావు. నీ వెల్లాంటి నిష్పక్షపాతబుద్ధితో శాస్త్రపరిశోధనలో మెలిగితివో అల్లాంటివిశాలభావాలతోనూ నిష్పక్షపాత బుద్ధితోనూ యీ సాంఘిక విధానాన్ని గురించి తెలుసుకోవాలి. అప్పుడే వ్యర్థసందేహాల్ని వదలిపెట్టి మానవ కల్యాణానికై పని చేస్తూన్న మాలో చేరుతావు. సంఘంలో యేకొద్దిమంది యిదివరకే సమస్త భోగాల్నీ అనుభవిస్తూన్నారో, సమస్త వుత్పత్తి పరికరాల్నీ తమ స్వాధీనమందే వుంచుకొంటూ శాస్త్రీయ పరిశోధనల సహాయంతో సంఘాన్నంతనీ అధోగతి పాల్జేసి తామొక్కరే భౌతిక సుఖాలకన్నిటికీ ఏకమాత్రాధికారులై వున్నారో, వారికే నీ బుద్ధినీ, శాస్త్రపరిజ్ఞానాన్నీ, వినియోగపర

పుట కిష్టపడక, పీడితులై అధోగతిలో మునిగివున్న ప్రజాసామాన్యానికే సాహాయ్యం చేయడానికి నడుముకట్టి ముందుకు దూకుతావు.

అప్పుడే నీ కర్తవ్యాన్ని నెరవేర్చిన వాడవగుదువు. నీ పను లకీ నీ ఏశాల మనోభావాలకీ పరస్పర వైరుధ్యముండదు. ఇదివరలో నీ వెప్పుడూ స్వప్నంలోకూడా అనుభవించని సంతృప్తినీ, ఆనందాన్నీ గం ర్తిస్తావు. ఆ రోజు వచ్చినప్పుడు ............... ఏ పక్షంలోనైనా ఆ రోజులు అట్టే దూరంలో లేదనే నా నిశ్చయం. ......... ఆ రోజు వచ్చినప్పుడు. నువ్వు యెల్లాంటి సాంఘిక మార్పుల్ని కోరుతున్నావో అలాంటి మార్పులు కలిగిన రోజు వచ్చినప్పుడు...............శాస్త్రీయ పద్ధతులపై ఐకమత్యంతో పనిచేయడంవల్ల అనుపమానసత్వం గలదై కోట్లకొలదీవున్న కార్మిక కర్షక వర్గం యొక్క సేవవల్లా, సానుభూతి వల్లా విపరీతవేగంతో త్రోసుకొని వస్తూన్న ఆ దినం వచ్చినప్పుడు .... వాస్తవం చెప్పవలసివస్తే ఆ రోజుననే ప్రకృతి శాస్త్రాలు నిజమైన అభి వృద్ధి గలవి అవుతవి. ప్రస్తుతం యీ శాస్త్రీయ విషయాల అభివృద్ధి అప్పటి పరిస్థితులతో పోల్చి చూస్తే, చిన్న పిల్లల, విద్యార్థుల యత్నాల వలె తోచక మానవు. ఆ రోజుననే నీవు శాస్త్రీయ జ్ఞానంవల్ల కలిగే నిజమైన ఆనందాన్ని అనుభవించ గలుగుతావు. ఇప్పటివలె గాక ఆ యానందం నీ తోడిమానవు లందరికీ కూడా లభిస్తుంది.

## న్యాయవాది యువకులకి

నువ్వు న్యాయశాస్త్రాన్ని చదువుట పూర్తిచేసి త్వరలోనే న్యాయవాద వృత్తిని స్వీకరించ దలచుకొన్నావు కాబోలు! బహుశా నీ భవిష్యజ్జీవితాన్ని గురించి నీలో కొన్ని వున్నతాశయాలు వుండి వుంటాయి.

నే ననుకోవడం ............... నీవు విశాలాంతఃకరణ గల వాళ్లల్లో ఒకడవనీ, స్వార్థత్యాగం, పరోపకారం, మొదలైనవి, నీ యభిప్రాయంలో వ్యర్థమైన మాటలు మాత్రమేగాదనీ, నీ జీవితాన్నంతనీ అన్యాయాన్ని నిర్మూలించడానికే వినియోగపరుస్తావనీ, నీ బుద్ధి చాతుర్యాన్నంతనీ, న్యాయచట్టంయొక్క వ్యవస్థాపనకైయే వెచ్చించ గలుగుతావనీ, అంతకంటె మానవ జీవితానికి ఉన్నతాదర్శం, సార్థక్యం మరేదీ వుండ జాలదనీ, నీవు భావిస్తూన్నావా? కాని, నీలోనూ నీవు కోరుకున్న జీవిత విధానంలోనూ సంపూర్ణ విశ్వాసంతో యీ జీవితరంగంలో ప్రవేశించు.

బాగుంది! న్యాయస్థానవార్తలను కలిగివుండే నా యసంఖ్యాకమైన పెద్ద పుస్తకాల్లో యేపేజీలోనైనాసరే, వాస్తవంగా మానవ జీవితాన్నెదుర్కొనే సమస్యల్ని గూర్చి విచారించుదాం.

ఇదుగో! యీ కేసు చూడు. ఈతడొక ధనికుడైన భూస్వామి. తన శిస్తును చెల్లించని, చెల్లించలేని, ఒక నిరుపేద రైతును తన భూమిలోనుంచి వెళ్లగొట్టవలసిందని యితడు కోరుతూన్నాడు. న్యాయశాస్త్రరీత్యా యందులో విశేషమేమీ లేనేలేదు. అతడు శిస్తు చెల్లించలేదు. ........... చెల్లించలేడు కూడా......... కనుక అతడు భూమిని వదలి వెళ్ళిపోవలసిందే. కాని, యీ సందర్భంలో వివరాల్ని తెలుసుకుంటే, కొన్ని యీలాంటి సంగతులు తెలుస్తాయి. ఈ భూస్వామి యెన్నడూ, ఆ భూఖండాన్ని ఫలవంతంగా చేయడానికి యేమీ చేసివుండలేదనీ, గత యేభై అరవై సంవత్సరాల్లోనూ రైలుమార్గాలు నిర్మించబడడంవల్లా, కొత్త రోడ్లు పోయడంవల్లా, మురుగు కాలవలు త్రవ్వడంవల్లా, ఆ చుట్టుప్రక్కలనుండే యితర భూఖండాల్ని సాగులోనికి తేవడంవల్లా, మరి యింకే కారణాలవల్లనైతేనేమి,—ఆభూముల ధర మూడురెట్లు పెరిగిందని; కాని యీ భూముల యభివృద్ధికి తరతరాలనుండీ రక్తాన్ని ధారపోసి,

చెమటోడ్చి పాటుబడ్డ రైతు షాహుకార్ల చేతుల్లోపడి, ఋణములతో తలమునిగి. కిస్తుయు చెల్లించలేకుండా పోయాడు. చట్టం యెప్పుడూ సదా ధనికుల పక్షాన్నే వుంటుంది. అందులో సందేహం యేమీ లేదు. చట్టప్రకారంగా భూస్వామిదే పరిపూర్ణమైన హక్కు. కాని నీవేమంటావు? బహుశా యీ న్యాయశాస్త్రాలనే కల్పిత శృంఖలాలు నీమనస్సు నిండా బంధించి యుండవు. ఆ రైతును కట్టుగుడ్డలతో, గంపెడు పిల్లలతో, నిరాధారంగా రోడ్డుమీద నిలపెట్టాలంటావా? అదేనా యీ న్యాయశాస్త్రం కోరేది? లేదా, యే రైతు యొక్క కాయకష్టంవల్ల భూమి ధర పెరిగిందో, ఆ రైతుకు భూస్వామిచేత భూమి యొక్క పెరుగుదల ధర ముదరా యిప్పించాలంటావా? ఉత్కృష్టమైన న్యాయం వుంటే, చేయవలసినదిదేకాదా? సర్వ సమానత్వము కోరేదిదే కాదా? నీ వేపక్షం వహిస్తావు? చట్టాని కనుకూలంగానూ, న్యాయానికి వ్యతిరేకంగానూ వుంటావా? లేదా, న్యాయాని కనుకూలంగానూ, చట్టానికి వ్యతిరేకంగానూ పని చేస్తావా?

పోనీ, మరొక ఉదాహరణం తీసుకో; ఆమిల్లులోని పనివాళ్లు ముందు నోటీసు చేయకుండానే సమ్మె చేశారు. నీవు యేపక్షంలో పని చేస్తావు? చట్టప్రకారం పనిచేస్తావా? అంటే తనకున్న ప్రత్యేకహక్కుల్నీ, సౌకర్యాల్నీ పురస్కరించుకుని యే కరువులోనో, యుద్ధసమయంలోనో అమితలాభాలను పోగుచేసుకున్న యజమాని పక్షాన పని చేస్తావా? లేక, చట్టానికి విరుద్ధమైనా సరే, దినానికి ఆరణాల కూలి కోసం తమ శరీరాన్ని అమ్ముకొని, భార్యా బిడ్డలు తమకండ్ల యెదుటే శుష్కించి పోతూంటే యజమాని కోసం అహోరాత్రాలు పని చేసి అమిత లాభాల్ని సమకూరుస్తూన్న ఆ బీదకూలీ పక్షాన్ని పనిచేస్తావా? చట్టంలోని ' స్వేచ్ఛా ఒడంబడిక ' (Freedom of Contract) మీద

త్రైన తియ్యని మోసపు మాటల్ని నీవు కూడా సమర్థించ యత్నిస్తావా? లేక, మానవుల్లో సర్వ సమానత్వమనే పరమ సత్యాన్ని: యే సత్యాన్ని దృష్టిలో నుంచుకొని చూస్తే, కడుపునిండా తిండికి ఏడుస్తున్న వానికిని, పూటగంటికైనా తన అమూల్య రక్తాన్ని విక్రయించుకొనే వానికిని, బలవంతునికి, బలహీనునికీ మధ్య జరిగిన, కంట్రాక్టు, కంట్రాక్టు వస్తా అవుతుందితే? అలాంటి సమానత్వాన్ని సమర్థిస్తావా?

హోటల్. మరొక నేరం. అదే. బొంబాయి నగరంలోని పెద్ద హోటలు. ఎంత పెద్ద సౌధము! ఎన్ని సౌకర్యాలు! ఎందరు పరిచారకులు! ఎంత రుచికరమైన పదార్థాలు! చినిగిన గుడ్డలతో తక్కుతూ తారుతూ అటు పట్లా పరుగెత్తుతున్నాడేమిటి? ఆ! తెలిసింది! పెద్ద రొట్టెముక్కదాన్ని దొంగిలించుకొని పోతున్నాడా! పాపం! అతడెవరో తెలుసుకుందాం. పని లేని ఒక శ్రామిక కూలీ అతడు. కొద్ది రోజుల నుంచీ అతనికి పని దొరకక పోవడంవల్ల భార్యా బిడ్డలతో పస్తున్నాడుట.

నాలుగు రోజులనుంచీ! నిజమే! ఇట్లాంటి వాళ్లెందరో వున్నారు. వాడి కీదుర్బుద్ధి యేమిటంటారా? ఉహూం. వాని నీస్థితికి తెచ్చింది సంఘవిధానం కాదా? అదిగో పాపం! వానిని వెంబడిస్తున్నారు. అయ్యో, దొరికిపోయాడు. అతన్ని అరెస్టుచేసి, న్యాయస్థానంలో హాజరుపెట్టారు. వానిమీద జాలి దలిచి, వదిలివేయమని హోటలువానిని కోరేరు, చాలామంది. కాని, ఆ పెద్దమనిషి సమ్మతించనిదే! ఆతనికి న్యాయమేనట కావలసింది. అతడు దోషి యని నిర్ణయించి, ఆరుమాసాలు కఠినశిక్ష విధించేరు! న్యాయమూ, చట్టమూ, గ్రుడ్డివి కాదేమిటి? ఇలాంటి తీర్పులు నిత్యమూ యెన్నో చెప్పబడుతూన్నాయని విన్న తర్వాతైనా, నీకే అంతరాత్మ అంటూ వుంటే తప్పక వాటిని ఎదిరించి తీరుతావు.

మరొకటి. అతడు చిన్నప్పటినుండీ అమ్మపాలు లేకుండా

చట్టాలకి బానిసవై వర్తించడం అంటే అంతరాత్మకి వ్యతిరేకంగా అన్యాయమార్గంలో చరించడం అని నీవు గ్రహిస్తావు. అందులో విశేషం యేముంది? తర్వాత యీ జిజ్ఞాసతో కూర్చుంటావా, నీవు? నీ అంతరాత్మ ప్రబోధాన్ని తృణీకరించి మోసగాడవైనా అవుతావు. లేదా యీ అంధ పరంపరను ఛేదించి, నీవు మాతో చేరి యీ సామాజిక, ఆర్థిక దురన్యాయాల్ని పూర్తిగా నాశనం చేయడానికి పని చేస్తావు. కాని, అప్పుడు నిన్నే మంటారు? సోషలిస్టు వనీ, విప్లవకారుడ వనీ, యింకా యేమిటో................

## ఇంజనీరింగ్ విద్యార్థులకు

తర్వాత నీ సంగతయ్యా, యింజనీరింగు విద్యార్థీ. పాపం. నీ వుద్దేశ్యాలు మంచివే. శాస్త్రీయ విషయాల్ని పరిశ్రమల్లో ప్రవేశపెట్టి, శ్రామికుల కష్టాల్ని సాధ్యమైనంతవరకూ తగ్గింపవలెననేనా నీ వూహ? అయ్యయ్యో! నీ వూహలన్నీ వ్యర్థాలే యని తెలుసుకోడానికి, నీ తెలివితేటలు మానవుని యింకా అధిక కష్టాల్లో ముంచివేస్తాయని తెలుసుకోడానికి, నీవు యెంత విచారిస్తావో! ప్రకృతిచేత వేరుచేయబడిన రెండు దేశాలున్నాయి. వాటికి రాకపోక సౌకర్యాలు కలుగచేసి, వాళ్లల్లో సోదరభావాన్ని, పరస్పర సహాయాన్ని, పెంపొందింపజేయ చూస్తావు. అందుకోసం పర్వతాల్ని బ్రద్దలుకొట్టి, అగ్రముల చివరగా, నదులపైగా, యెన్నెన్నో చిక్కులుదాటి రైలుమార్గాన్ని నిర్మించాలి. మార్గం ప్రారంభించబడింది. వేలకొద్ది కార్మికులు రెక్కలు ముక్కలు చేసుకుంటూ

పెరిగేడు. బాల్యంనుంచీ చాలా కష్టములనుభవిస్తూ, అందరిచేతా నిరసించబడుతూ ఆదరించేవాళ్ళుగాని, మంచిమాటలు చెప్పేవాళ్ళుగాని యెవరూ లేక, యెల్లాగో పెరిగి పెద్దవాడయ్యేడు. ఆఖరికి ఆతడు చేసిందేమిటి? ఒక్క పూపాయిని దొంగిలించడానికై పొరుగు వాని నిండుప్రాణాన్ని తీసేడు. అతనిమీద కూడ చట్టాన్ని ప్రయోగించాలనే కోరుతావా? ఆతనిని వురితీయాలని విధిస్తావా? లేక అంతకన్న నీచంగా ఆతన్ని యావజ్జీవం జైలులో వుంచాలని విధిస్తావా? ఆతడు నేరస్తుడా? లేక పిచ్చివాడా? ఏమి, మాట్లాడవు? ఏది యెల్లావున్నా ఆతనిలో మానవత్వాన్ని నశింపజేసిన యీ సంఘానిదే తప్పు గాని ఆతని దొక్కనిదే మాత్రం గాదని నిశ్చయంగా చెప్పగలము.

నిరాశులై మిల్లులకు నిప్పంటించిన యీ నేతగాండ్రు, కూలీలు అందరూ జైల్లో తోయబడాలనే కోరుతావా? లేక, యీ దురన్యాయాల్ని ఆటంకాన్ని, నిరసిస్తూ, భవిష్యద్ధ్వజాన్ని నాటిన యీ ధైర్యశాలులైన వీరుల్ని కాల్చించి వేయాలంటావా? కాదు, కాదు. అట్లనవు. వెయ్యింటికీ అట్లాఅనలేవు.

నీవు నేర్చుకున్న దానినే చిలకలాగ తిరిగీ పలకడంతో తృప్తిపడక, తర్కించుకొందు వేని, న్యాయచట్టాన్ని కప్పివుంచిన ఆ పొరను తొలగింతువేని, నీ వేమి చూడగలుగుతావు? చట్టానికి మూలమేది? బలవంతుల హక్కులు గావా! చట్టానికి పర్యవసానమేమి? బలవంతుల బలహీనుల నణగద్రొక్కుట గాదా! మానవజాతియొక్క కడు దీర్ఘమైన, రక్తప్లావితచరిత్రలో పీడితులికి చేసిన ఘోర అన్యాయాలకి అర్థాన్ని కల్పించుటయే, చట్టానికి వుద్దేశ్యం. నీవెప్పుడైతే దీన్ని తెలుసుకున్నావో అప్పుడే న్యాయచట్టమంటే అసహ్యత, యేవగింపు నీకు కలిగి తీరుతుంది. అందులో ఆశ్చర్యమేముంది? పుస్తకాల్లో వ్రాయబడిన

చట్టాలకి బానిసయై వర్తించడం అంటే అంతరాత్మకి వ్యతిరేకంగా అన్యాయమార్గంలో చరించడం అని నీవు గ్రహిస్తావు. అందులో విశేషం యేముంది? తర్వాత యీ జిజ్ఞాసతో కూర్చుంటావా, నీవు? నీ అంతరాత్మ ప్రబోధాన్ని తృణీకరించి మోసగాడవైనా అవుతావు, లేదా యీ అంధ పరంపరను ఛేదించి, నీవు మాతో చేరి యీ సామాజిక, ఆర్థిక దురన్యాయాల్ని పూర్తిగా నాశనం చేయడానికి పని చేస్తావు. కాని, అప్పుడు నిన్నే మంటారు? సోషలిస్టు వనీ, విప్లవకారుడ వనీ, యింకా యేమిటో...............

## ఇంజనీరింగ్ విద్యార్థులకు

తర్వాత నీ సంగతయ్యా, యింజనీరింగు విద్యార్థీ. పాపం, నీ వుద్దేశ్యాలు మంచివే. శాస్త్రీయ విషయాల్ని పరిశ్రమల్లో ప్రవేశపెట్టి, శ్రామికుల కష్టాల్ని సాధ్యమైనంతవరకూ తగ్గింపవలెననేనా నీ వూహ? అయ్యయ్యో! నీ వూహలన్నీ వ్యర్థాలే యని తెలుసుకోడానికి, నీ తెలివితేటలు మానవుని యింకా అధిక కష్టాల్లో ముంచివేస్తాయని తెలుసుకోడానికి, నీవు యెంత విచారిస్తావో! ప్రకృతిచేత వేరుచేయబడిన రెండు దేశాలున్నాయి. వాటికి రాకపోక సౌకర్యాలు కలుగచేసి, వాళ్లల్లో సోదరభావాన్నీ, పరస్పర సహాయాన్నీ, పెంపొందింపజేయ చూస్తావు. అందుకోసం పర్వతాల్ని బద్దలుకొట్టి, అగ్రముల చివరగా, నదులపైగా, యెన్నెన్నో చిక్కులుదాటి రైలుమార్గాన్ని నిర్మించాలి. మార్గం ప్రారంభించబడింది. వేలకొద్ది కార్మికులు రెక్కలు ముక్కలు చేసుకుంటున్నారు. సౌరంగాల్లో, చలిజ్వర ప్రదేశాల్లో, నదులమీదా, చాలా ప్రమాదకరాలైనచోట్లల్లో, అసంఖ్యాకులు కష్టించి పని చేస్తున్నారు. ఆ పని

వాళ్లు కుటుంబాలు వందలకొద్దీ, వేలకొద్దీ యీ పనిలోనే చెమటోడ్చి, రక్తాన్ని ధారపోసి, చివరకు ప్రాణాన్ని కూడా గోల్పోతూన్నారు. యే కొద్దిమందో మాత్రం పదో అయిదో రూపాయిల్ని, మితిమీర పని చేయడంచేత క్షయనో, చలిజ్వరాన్నో మూటకట్టుకుని, బలసత్వాలుడిగి, తమ తమ గ్రామాలకి అల్ప సంతోషులై పోతూన్నారు. చిట్టచివరకి రైలు మార్గం నిర్మించబడింది. కాని, ప్రతి అంగుళమూ మానవాస్థికలచే భీతి గొల్పుతూ వుండటం లేదా? దీని కంతటికీ కారణం- యేమైవుంటుంది? మానవునిలో మితిలేకుండా పెరిగిపోయిన లాభాకాంక్ష గాదా? పోనీ. తుదకా రైలుమార్గంయొక్క ప్రయోజనమేమిటి? దేశాల్ని జయించడం కోసం సైనికుల్ని తీసికొని పోవడానికుపయోగింపబడుతూంది. చూశావా, నీ మేధాశక్తికీ, విరామంలేని నీ పరిశ్రమకీ ఫలితమెట్లావుందో! ఇదేనా నీవు కోరేది?

నీ యౌవనాన్నంతటినీ పరిశోధనలలోనే గడిపితివి. ఉత్పత్తి విధానాల్ని సౌకర్యయుతం గావించి, మానవ సంఘానికి గావలసిన వస్తు సముదాయాన్ని తక్కువ కష్టంతో సృష్టించుటయేకదా, నీ యాశయము. ఎన్నో శ్రమలు పొందుతూ, ఎన్నో రాత్రులు ఆలోచనలతో గడపుతూ, తుట్టతుదకు నీ పరిశోధనను పూర్తిచేసేవు. ఫలితాన్ని ఆచరణలో పెట్టించేవు. కాని పర్యవసానం నీ తలను మించిపోయింది. వేలకొలది జనానికి పనులు లేకుండా పోయాయి. ఇంక పనుల్లో వున్నవాళ్లా చిన్నపిల్లలు—వాళ్లైనా కేవలం యంత్రాలుగా, కీలుబొమ్మలుగా చేయబడ్డారు. ముగ్గురో, నలుగురో, అథవా యే పదిమందో పెట్టుబడిదార్లు కోట్లకొద్దీ గడించి, పీపాలతోకే ' చాంపేన్ ' తాగుతూన్నారు. ఇల్లాంటి ఫలితాన్నేనా నీవు కోరింది? దీన్నేనా నీవు వాంఛించింది? యెట్టి దారుణ స్వప్నము!

ఇన్ని మాట లెందుకు? ఆధునిక పారిశ్రామికాభివృద్ధి చరిత్రను చదివి చూడు! కుట్టుడు యంత్రం కనిపెట్టడంవల్ల దర్జీవానికి యేమి లాభం కలిగింది? ఏమీ లేదు. డైమండ్ ట్విల్లుగుడ్డలు కట్టుకుంటూనే వున్నాడు. కాని, సెయింట్ గోథర్డు సొరంగంలోని కూలివాడు, యాంకిలోస్మాచే చనిపోతూనే వున్నాడు. రోజు కూలీలూ, మేస్త్రీలూ పనేమీ లేక, మాడిపోతూనే వున్నారు. నీవు యెల్లాంటి తీవ్ర మనస్సుతో యెల్లాంటి నిష్పక్షపాత బుద్ధితో పారిశ్రామిక సమస్యల్ని ఆలోచించేవో, అల్లాంటి బుద్ధితోటే సామాజిక సమస్యల్ని గురించికూడా ఆలోచిస్తే. దీని లోని మూలసూత్రం నీకు కనపడక పోదు. ప్రత్యేకపుటాస్తులు, కూలి పనిపద్ధతి,— యీ రెండూ సంఘంలో వున్నంతకాలం ప్రతీ కొత్త పరిశోధనా కూలీలయొక్క సౌకర్యాన్ని వృద్ధిచేయడానికి మారుగా, అతని జీవితాన్ని నాశనం చేస్తూంది. నిరుద్యోగాన్ని యెక్కువ చేస్తుంది. అతని బానిసత్వాన్నింకా బిగువు చేస్తుంది. ఆతని కష్టాన్ని నైచ్యతకు గురిచేస్తుంది. కరువు నధికము చేస్తుంది. ఇంతేగాక ఇదివరలోనే సోమరియై సుఖానందములలో మునిగి తేలుతూన్నవాళ్ళనే యింకనూ అభివృద్ధిలోకి తెస్తుంది.

ఈ విషయాల్ని తెలుసుకున్న తర్వాత నీ వేమి నిశ్చయం చేసుకుంటావు? బహుశా నీ యంతరాత్మను శుష్క వేదాంతంతో అణచి పెట్టి స్వార్థపరుడవై పోతావు. ఒక శుభదినాన నీ చిన్ననాటి విశాలభావాలకు స్వస్తిచెప్పి, కేవల స్వార్థసుఖానందాలకై పాడుబడ నారంభిస్తావు. అంటే, నీవు కూడా యీ ప్రత్యక్ష దోపిడిగాండ్ర కూటంలో చేరుతావన్న మాట. లేదా, నీవే మృదుల హృదయుడవైనవాడైతే యిట్లా అనుకుంటావు! "కాదు. ఇది నూతన శాస్త్ర పరిశోధనలతో కాలం పుచ్చవలసిన సమయం గాదు. మొట్టమొదట వస్తూత్పత్తి విధానంలో వున్న లోపాల్ని సవరించాలి. ఎప్పుడైతే ప్రత్యేకపుటాస్తులనుమాట లేకుండా చేయగలు

గుతామో? అప్పుడే ప్రతి నూతన పరిశోధనా ఫలితమూ మానవ సమాజా నికంతకూ చెందుతుంది. ప్రస్తుత ధనస్వామ్యసంఘం క్రింద కేవలయం త్రాలకన్నా అస్వతంత్రులై, వ్యక్తిత్వంలేని యీ కోట్ల కొలదిగా వున్న కూలీలు అప్పుడు ఆలోచించి పనిచేయగల సమర్థులై, చదువుటచేత, అను భవంచేత, గడించిన ధీశక్తిని పారిశ్రామికాభివృద్ధికై వినియోగించగల వాళ్లవుతారు. మనం స్వప్నంలో కూడా వూహించి యుండనంత అభి వృద్ధికి ఒక అర్ధశతాబ్దంలోనే యంత్రసాధనాలు ముందుకు పోయి తీరుతాయి.

## బడిపంతులు

ఉపాధ్యాయులకి నే చెప్పవలసిందేమిటి..................ఎవరు తమ వృత్తిని నీచమైనదిగా, బాధాకరమైనదిగా ఎంచుకుంటారో, వాళ్లకు గాదు నే చెప్పేది......... మరెల్లాంటి వాళ్ళకంటె, ఎవరు, నిర్మలానంద పూరి తులై అమాయికమైన చూపులతో, విక విక నవ్వుతూవున్న పిల్లలు చుట్టూ కూర్చున్నపుడు,- తన చిన్నతనంలో తన కెట్టి విశాల భావాలూ, మానవసేవాసక్తి వుండేవో,- అల్లాంటి భావాలే వాళ్ళ తలల్లో చొప్పిస్తూ, వాళ్ళని కాగల భాగ్యశాలులుగా తయారుచేయడం ఎట్లాగా యని ఆలోచించే వుత్తమ గురువులకే.

తరుమగా నీవు విచారంగావున్నట్లు కనపడుతూన్నావు. నీకను బొమ్మలు అట్లా ఎందుకు ముడిచిపైచుకుంటూన్నావో నాకు తెలుసులే. ఆ కుఱ్ఱవాడు నీకు చాలా యిష్టుడనుకుంటాను. ఆతడీ రోజున వ్యాకరణ సూత్రాలు చదువుకొని రాని మాట నిజమే. కాని ప్రతాపసింహుని చరి త్రలోని రెండు పద్యాలూ వప్పచెప్పనప్పుడు యెల్లాంటి వుద్రేకాన్ని

చూపించేడు! అక్కడే, అప్పుడే, ఆ క్రూరుల నందర్నీ కత్తి తీసికుని పొడవగోరెనా యన్నట్లుండలేదా? అతని కండ్లు మిలమిల మెరసినయి; కంఠంలో మధుర భావపూరితమైన వుద్రేకం కనిపించింది.

కాని యింటికి పోయిన తర్వాత, తల్లి, తండ్రి, మామా కూడా అతన్ని చీవాట్లు పెట్టేరు. బలవంతులికి, మతగురువుకీ, ప్రభువుకీ, పల్లెటూరి అధికారులికీ, అందరికీ గౌరవం చూపాలని చెప్పేరు. అధికారులయెడ భయభక్తులు, పెద్దలయెడల అడకువ, సంసారపక్షంగా వుండడం, మొదలైన మహావిషయాల్ని గురించి వుపన్యాసాలు కొట్టేరు. ఆ కుర్రాడు హడిలి బేజారై పోయాడు. స్వాతంత్ర్యభావ పూరితమైన ఆ పుస్తకాన్ని క్రింద పారేసి 'నీతికథామంజరి' ని తీసుకొనేవరకూ వాళ్ళ చీవాట్లు శాంతించనే లేదు.

ఇంకోటేమిటంటే. నీ దగ్గిర చదువుకున్నవాళ్ళల్లో గట్టివాళ్లని నీ వనుకొన్నవాళ్లందరూ పరమ దౌర్భాగ్యులుగా తయారైనారని తెలుసుకున్నావు. ఒకడు తనకేదో పెద్ద వుద్యోగం రావాలనే దివాస్వప్నాలు కంటూవుండడం కంటె మరేమీ ఆలోచించడమే లేదు; మరొకడు గుమాస్తా పనిచేస్తూ, తన యజమానితోపాటు కూలీలకిచ్చే బేడ డబ్బుల్లోంచే మామూళ్ళ పేరు చెప్పి, కక్కుర్తిపడి వాళ్ళ పొట్ట కొడుతూన్నాడు. నీవనుకున్నావు, వీళ్ళంతా తెగచదివి మానవ సంఘాన్నంతా ఉద్ధరిస్తారని. కాని నీవూహలు నిరాధారాలైనాయి. దాన్ని గురించే నీ విప్పుడాలోచిస్తూన్నావు. నాకిట్లా పొడగట్టుతూంది. ఇంకెన్నో రోజులు అవసరం లేదులే. మహాఅయితే ఒక యేడాదిలోనే నీవిట్లా తలచే రోజు వస్తుందనేనా భయం. మహాపొడిచేస్తారనుకున్న యువకులంతా యీవిధంగా నీఆశయాలని విఫలం చేయడం చూసి చూసి, ప్రాణం విసిగి, యిట్లా అనుకుంటావు; "ప్రతాపసింహుడు చాలా స్వాతంత్ర్యప్రియుడే గాని

బొత్తిగా ప్రపంచజ్ఞానం తెలియని పిచ్చివాడు. పగలల్లా ఏ ' రూల్ ఆఫ్ త్రీ ' మో పిల్లలకి నూరిపోసి యింటికొచ్చింతరువాత యే కుక్కి మంచంలోనో పడుకుని మననం చేసుకొనేందుకే గాని యీ కవుల వ్రాతలు ప్రయోగం మరేమీ లేదు. కవులందరూ మేఘాల్లో విహరిస్తూంటారు. మన నిత్యజీవితానికీ వాళ్ల వ్రాతలకీ యేమీ సంబంధం వుండనే వుండదు. ఒకవేళ దానికెంటికీ సంబంధం వుంటే వుండొచ్చును గాని కవుల వ్రాతలకీ రేపొచ్చే స్కూల్ఫైనలెస్సెల్సరు పరీక్షకి అసలే సంబంధం వుండదు. నాకెందుకొచ్చిన పీగొడవలన్నీ, తప్పదు. అందరిలాంటి వాడవే అయితే యింతే అనుకుంటావు.

కాని, నీలో మానవత్వమూ పౌరుషమూ యేమాత్రమున్నా, నీలో వేడి రక్తమే ప్రవహిస్తూంటే,- నీ వయస్సు మళ్లినా ఫరవాలేదు,- నీ యౌవన కాలంలో నీలో జాగృతములై వుండిన వున్నతాశయాల సిద్ధికై పని చేయనిశ్చయించుకుంటావు. పిల్లలందరికీ, స్కూళ్ళల్లోనూ, యింటివద్దా కూడా విశాలాభిప్రాయాల్ని కలుగచేసే, మానవత్వాన్ని పెంపొందింపచేసే విద్యయే కావాలంటావు. అట్లాంటి సౌకర్యాలు నేటి ధనస్వామ్య సంఘంలో యెప్పుడూ కలుగచేయబడవు, సహింపబడవు, అని తెలుసుకుంటావు. వెంటనే యీ సంఘ విధానాన్ని తీవ్రంగా విమర్శన చేస్తావు. విద్యాశాఖవారు వెంటనే నిన్ను పనికిరాని వాళ్ళల్లోనూ, రౌడీముండావాళ్ళల్లోనూ జమచేసి, వాళ్ళలిస్టులోంచి తప్పించుతారు. బ్రతుకు జీవుడా యని, ఒక్క నిట్టూర్పు విడిచి, నీ కర్తవ్యాన్ని ప్రారంభిస్తావు. వయస్సులో నీకంటె పెద్ద వాళ్లైనా నీదగ్గర చదువుకోదగిన వాళ్ళందరికీ నీవు చెప్పడం ప్రారంభిస్తావు. ఏమిటా! మానవ సంఘం ఎట్లా వుండాలో, కాదుకాదు, ఎట్లా వుండడానికి అవకాశాలున్నాయో, అనేదాన్నే. అంతే నీవు కూడా యీ సోషలిస్టుల్లో చేరి, యీ అవకతవక సంఘంయొక్క

మూలమట్టాన్ని కూలగొట్టడానికి ప్రయత్నిస్తావు. అంటే, యీ ప్రపంచంలో, మానవజాతికి నిజమైన స్వాతంత్ర్యం, తరుగులేని స్వాతంత్ర్యం, నిజమైన సౌభ్రాతృత్వం, నిజమైన సమానత్వం కలుగచేయడానికి మాతో చెయ్యి చెయ్యి కలిపి పని చేస్తావన్నమాట.

## ఇక కళోపాసకులకు

ఓ యువకులైన చిత్రకారులారా! శిల్పులారా! గాయకులారా! కవివతంసులారా! మీ పూర్వులను యే పవిత్రభావాలు ప్రేరేపించినాయో అట్టివి మీలో వెదికినా కనిపించడం లేదు. కళ, వెనుకటికి వలెనే మానవులందరికీ ఆనందం కలిగించేదే. సర్వప్రజలకీ సమానహక్కు. కావిదళారీ వ్యాపారమే కనిపిస్తూంది, నేటి కళలలో.

మరొకలాగ యెట్లా గుంటుంది. కళల్లోని విప్లవకరశక్తినశించిం తర్వాత యింతకంటె యెక్కువగా యెట్లా వుంటుంది? మధ్యయుగంలో సృష్టికి ప్రతిసృష్టి చేసిన చిత్రకళ, నీచ దృశ్యాల్ని చిత్రించడంతో తృప్తి పొందుతూంది. కవిత్వం యే శయనాగారాన్నో, త్రాగుబోతుల వైభవాన్నో వివరంగా వర్ణిస్తూ, వదుపువృత్తిలోకి దిగింది.

'అల్లాగైతే యేమిచెయ్యమంటావయ్యా?' అనేనా నీప్రశ్న. నా సమాధానమేమిటంటే, నీలోని పవిత్రాగ్ని ఆరిపోయేవుంటే, నీవేంచేస్తూంటావంటే, యిదివరదాకా నీవేమి చేసేవో దానినే. నీ కళ యెందుకు పనికి వస్తుందంటే వర్తకుల దుకాణాలను అలంకరించడానికే. నీ కవిత్వము, సంక్రాంతికి పత్రికల్లో చిట్టికథలూ, గీతికలూ వ్రాయడానికే. అధమాధమ తరగతిలో చేర్చదగిన నాటకాల్లో వేషాలు వేయడానికే నీ సంగీతనాట్య కళలు. మీరిప్పటికే యిల్లాంటివాళ్లుగా తయారైనారు. మీకళలు

కొడిగట్టిన దీపాల్లాగ జ్యోతిర్హీనాలుగా వున్నాయి.

కాని, నీలోనే హృదయమంటూ వుంటే, అది మానవత్వానికి త్వరపెడుతూ వుంటే. నిజమైన కవివలె మానవ యథార్థజీవితాన్ని తిలకించగల శక్తే వుంటే. నీకు కనపడేదేమిటి? లోకమంతా దుఃఖపూరితమైనదిగానూ. ప్రతిచోటా మానవుడు బాధించబడుతున్నట్లూ చూస్తావు. ఇక్కడ మనుష్యులు ఆకలిచిచ్చు చేత చావడం కూడా చూస్తావు. మరోచోట గనుల్లో మానవ కళేబరాలు గుట్టలు గుట్టలుగా పడి వుండడం వీక్షిస్తావు. వీరత్వం, దేశాభిమానం, అనే మోసపు మాటలతో అసంఖ్యాకులైన అమాయికప్రజల్ని యుద్ధరంగాల్లో లక్షలకొలదిగా చంపించడం చూస్తూంటావు. ఇదిగో! ఎవరు వీళ్లు! బారులుతీరి భారాలైన సంకెళ్లను యీడ్చుకుంటూ పోతూన్న యువకులు వీళ్లెవరు? విదేశాల్లోనూ, సముద్రమధ్యమందలి దీవుల్లోవున్న జైళ్ళల్లోనూ, విప్లవకారుల క్యాంపుల్లోనూ, వుంచబడడానికై కొనిపోబడుతూన్న ప్రవాసులా యేమిటి! పాపం! వాళ్ల మాతృభూమినుండి, సోదర మిత్రులనుండి కొంపోబడుతూన్న యీ అమూల్య హృదయాలు, అమానుషబాధలచేత అవసిపోయి ఆ రాతి గోడలమధ్య, అపరిచిత దేశాల్లోనే రాలిపోతాయి గాబోలు! ఏ సోదర మానవుల క్షేమాభివృద్ధులకోసం వాళ్ల ప్రాణాలని ధారపోస్తూన్నారో, వాళ్ళ స్వసుఖాల్ని వదులుకుంటున్నారో, అట్టి పీడితులూ, దీనులూ మేలుకొనక పోవడం చేతనేగదా, వీళ్ళకీగతి!

ఓ మానవుడా! ఈసమాజంలో నిత్యమూ జరుగుతూన్న యీ అసమపోరాటంలో నీవు తటస్థుడవుగా ఎట్లా వుండగలుగుతావు? మహాధైర్యానికీ— నీచపు పిరికితనానికీ, మహోన్నతాదర్శానికీ— నీచపు స్వార్థానికీ మధ్య జరుగుతూన్న యీ పోరాటంలో తటస్థంగావుంటే, నీలో మానవత్వం వున్నదని ఎట్లా అనుకొంటాము? లేదు, లేదు. నీవు తట

స్థంగావుండలేవు. తప్పక అధర్మంచేత నాశనం చేయబడుతూన్న పీడిత ప్రజల పక్షాన చేరుతావు, నీవు. జయింపబడిన వీళ్ల శిబిరాలనుండి ఎలాంటి భయంకర ఆర్తనాదాలు! కాని, ఏమి యీవున్నతాదర్శముల శక్తి! ఎవరు జ్ఞానజ్యోతికై మానవ సంఘానికై, పవిత్రన్యాయానికై, పోరాడుతూన్నారో, వాళ్లే ధన్యులు! వాళ్లే సుందరజ్యోతిర్మూర్తులు!! అట్టి వాళ్ల పక్షంలో చేరడం, నీ కర్తవ్యమని వేరే చెప్పాలా?

'ఏమిటి నేను చేయవలసింది?' అంటూ చివరికి వన్ను ఆపుతావు.

"ఏమిటోయి, యీ గొడవంతానూ?" అంటావు నువ్వు. "శాస్త్రపఠనమూ, పరిశోధనాభోగానుభవానికే అయితే; వైద్యవృత్తి మోసమూ, కళ్ళనీళ్ల తుడవడమూ అయితే; న్యాయవాదవృత్తి అన్యాయాన్ని నిరంకుశంగా సాగించడానికే అయితే; మానవుని శ్రమ తగ్గించడానికి కనిపెట్టబడే యంత్రాలన్నీ దోపిడీయత్నాలే అయితే; పిల్లల్లో సరియైన విజ్ఞానాన్ని వ్యాపింపచేసి, కర్తవ్యబోధ చేయడానికి యీ స్కూళ్లే పనికిరావంటే; కళల్లో పవిత్రవిప్లవాగ్నియే లేకపోతే యివన్నీ ఆభాసమాత్రమేనని చెప్పేటట్లయితే; మరేం చెయ్యమంటావు? చేతులు ముడుచుకొని కూర్చోమంటావా? కళ్లు మూసుకు నిద్రపొమ్మంటావా?"

ఓరి పిడుగా! నీ వేమి చెయ్యాలో చెప్పనేలేనా! చేతినిండా వుంది, పని. అందులో, నీ చేతలు అంతరాత్మ ప్రబోధంతో పూర్తిగా యేకీభవిస్తాయి. ఎందరో కురుకైనవాళ్ళకీ, ఉన్నతాదర్శాలుగల వాళ్ళకీ యీ పనిలో పవిత్రజ్యోతీ, ప్రేరేపణా కనిపిస్తాయి.

'ఏమిటా పని?' ఇదిగో చెపుతూన్నా.

ఇవిగో, రెండేమార్గాలు. మూడోది లేనేలేదు. నీ అంతరాత్మను చంపుకొని, నీ వున్నతాదర్శాలకు శాశ్వతంగా స్వస్తి చెప్పి,

విప్లవ సందేశం.

'పోనిద్దూ, నామట్టుకు నేను సుఖంగా, నాజీవితాన్ని ఆనందంగా గడుపుతున్నంతకాలం యీ మానవులంతా యేగంగలో దిగితే నాకేమి? ఈ కష్టాలంతా చవటలైపోయి నన్ను స్థిమితంగా అనుభవించనిచ్చినంత కాలం నాకీగొడవెందుకు?' అని అనేస్తావు. లేదా యింకో మార్గమేదంటే, నీవీ సోషలిష్టుల్లోచేరి, యీ పాడుపడిపోయివున్న సమాజాన్ని పూర్తిగా మార్పుచేయడానికై పాటుపడతావు. నీవు నిష్పక్షపాతబుద్ధితో ఆలోచించేటట్లయితే యీ నిశ్చయానికే వచ్చితీరుతావు. నీవే అన్నమాటేమిటి? ప్రతితెలివైనవాడూ యిట్లాంటి నిశ్చయానికే రాకమానడు. అయితే ఒక్కటుంది. స్వార్థపరత్వబుద్ధితోకూడిన స్నేహితుల సలహాపై నీ నిర్ణయం ఆధారపడి వుండకూడదు. నీకున్న బూర్జువాసంస్కారంవల్ల పట్టుబడిన యీ తప్పుడభిప్రాయాల్నీ, పెడదారినిపెట్టే సందేహాల్నీ లెక్కచేయకూడదు.

అట్లా దారికి రా. ఈ నిశ్చితాభిప్రాయానికి వచ్చిన తర్వాత యింకో ప్రశ్న వస్తుంది. కార్యక్రమవిధానం ఏమిటి చెప్మా? అని.

ఇందుకు జవాబు చాల సులభం.

నీవు ప్రస్తుతవు స్థితిలోనుండి చూస్తూన్నంతకాలమూ, కూలీ రైతులు అంటే యేవో జంతువులనీ, మనకంటె భిన్నమైన వాళ్లనీ తలుస్తావు. అంచేత నీవుకూడా వాళ్ళల్లో ఒకడవుగా ఎప్పుడవుతావో అప్పుడిట్లాంటి ప్రశ్న లేవీ రావు.

ఇక్కడా, అక్కడా, అన్నమాటేమిటి? అక్కడ యింగ్లాండులో, యిక్కడ జర్మనీలో,- అక్కడ యునైటెడ్ స్టేట్సులో, యిక్కడ యిటలీలో,— అక్కడ చైనాలో, యిక్కడ యిండియాలో,— యింకా ప్రతిదేశంలోనూ, యెక్కడెక్కడ పీడించేవాళ్ళూ, పీడించబడేవాళ్ళూ వున్నారో అక్కడక్కడల్లా- కూలీ రైతుల్లో ఒక బ్రహ్మాండమైన వుద్య

మం బయలుదేరి పనిచేస్తూంది. ప్రతీదేశంలోనూ వాళ్ళల్లో ఆత్మవిశ్వాసం, వర్గచైతన్యం జాగృతమౌతూంది. పెట్టుబడిదారీ ప్రభుత్వ విధానం వల్ల సామాన్య ప్రజలపై విధింపబడిన బానిసత్వాన్ని శాశ్వతంగా నాశనం చేసి, ఆ సమాజ అస్తికలపై నూతన సమాజానొకదాన్ని,- న్యాయమూ, సమానత్వమూ, సోదరత్వమూ,- అనే వున్నతాదర్శాలపై నాధారపడి వున్ననూ, తన సమాజానొకదాన్ని,- నిర్మాణం చేయడమే మన ఆదర్శం. సమాజంలో వుండే అన్యాయాల్నీ, బాధల్నీ గురించి హృదయాల్ని ద్రవింప చేసే గీతాల్ని పాడుకుంటూ కూర్చుంటే కాదు. అట్లాంటి గీతాల్ని పద్ధెనిమిదో శతాబ్దంలో బానిసలూ పాడేవాళ్లు. ఇప్పటికీ అనేకచోట్ల పాడుతూన్నారు కూడాను. పాటలతో మన కర్తవ్యం పూర్తికాదు. చేయవలసిందల్లా, తన్నెదుర్కొని బానిసత్వంలో వుంచేటందుకు చేయబడే ప్రయత్నాలన్నిటినీ చలించని ధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో త్రోసిరాజనడానికై పనిచేయడమే. ప్రతిచోటా యిట్లాంటి ప్రయత్నాలు తీవ్రంగా కొనసాగించబడుతూనేవున్నాయి. ఈ జీవితం,—మానవ సమాజంలో మూడువంతులమందికి యాతనాపూరితంగా వున్న యీ దుర్భరజీవితం,— అందరికీ సంతోషదాయకంగానూ, ఆశాపూరితంగానూ వుండేటట్లు చేయడమెట్లాగ? అనే ప్రతీవాడూ యోచిస్తూన్నాడు. తన లోకజ్ఞానాన్నీ, తన అనుభవాన్నీ, తన దుఃఖపూరిత జీవితాన్నీ వుపయోగించి, సామాజిక జీవితాన్ని యెదుర్కొంటూన్న క్లిష్టసమస్యల్ని విడదీయడానికే ప్రయత్నిస్తూన్నారు. దుర్భరజీవితరంగంలో తనతోబాటు సహచరులుగా వున్న వాళ్లతో తనకు యైక్యత కలిగించుటకొరకై సంఘాలని స్థాపింప ప్రారంభిస్తున్నాడు ఏకైకాదర్శానికై పాటుపడేవాళ్లందరూ ఒక్క సంఘంగా చేరి విషమసమస్యల్ని యెదుర్కోడం నేర్చుకుంటారు. చాలీచాలని స్వల్పవిరాళాలపై ఆధారపడిన సంఘాల్ని బహుకష్టంతో స్థాపిస్తారు. దేశ విదేశాల్లో వున్న

తమలాంటి సోదర బృందాలతో సంబంధాలు కల్పించుకుంటారు. ఎట్లాంటి సామాజిక వ్యవస్థ స్థాపించబడినట్లైతే యీ ప్రపంచాన్ని అలుముకున్న అశాంతి, యుద్ధప్రియత్వమూ తొలగింపబడతాయో అట్లాంటి సమాజనిర్మాణానికీ, ఆ శుభదినం త్వరలో రావడానికీ యీతడు,— యీ పెద్ద కబుర్లు చెప్పే రాజకీయవేత్తలూ, శాంతిదూతలూ, మానవ సేవాపరాయణులూ,- అని పిలువబడే వీళ్ళందరికంటే యెక్కువగానే పని చేస్తాడు. తన తోటిసోదరులు విదేశాల్లో యేమిచేస్తూన్నారో తెలుసుకోవడం కోసం, వాళ్ళలోగల పరస్పర సంబంధాలు వృద్ధిచేసుకోవడం కోసం, తన భావాల్ని యింకా విశాలపరుచుకోవటానికి. ప్రచార సౌకర్యం కోసం తన పత్రికల్ని అతికష్టంమీద సాగిస్తూంటాడు. అతని శ్రమ, నిరంతరకృషి, యెంత ఉన్నతభావమూలకములు! ఎల్లాంటి విసుగూ, విరామమూ లేని పోరాటాన్ని సాగిస్తూన్నాడు. ఎడతెగని కష్టాలవల్ల, తప్పుడభిప్రాయాలవల్ల, ప్రభుత్వ దౌర్జన్యాలవల్ల, ధైర్యహీనులై కొందరు తన్ను విడిచిపోతూంటారు. ఒక్కొక్కప్పుడు తుపాకీగుళ్ళవల్లా, ఆకస్మికదండయాత్రలవల్లా చెదరిపోయిన తన సహచరుల్ని తిరిగీ కూర్చుకుంటూండాలి. ఒక్కొక్కసారి సమూహ వధలవల్ల పాడుబడిపోయిన ' స్టడీ- సర్కిల్సు ' ను తిరిగి కొనసాగిస్తూండాలి. ఎంత కష్టము!

ఈ పత్రికలన్నీ నడపాలీ అంటే నిద్రాహారాలు కూడా వదలిపెట్టాలి. ఎక్కడెక్కడి వార్తలో సంపాదిస్తూండాలి. ఎన్నెన్ని విషయాలో చదివి పాఠకులకవి సరిగా అందచేస్తూండాలి. తమ జీవితావసరాలకై బానిసలుగా పనిచేస్తూన్న కార్మిక వర్గమంతా యీ ఆందోళనను సాగిస్తూంటారు. వాళ్లు కానీ-కానీ చొప్పున విరాళాలు వేసికొని డబ్బు పోగుచేస్తారు. గంజిలో వుప్పునైనా మానేస్తారు గాని యీ ఆందోళనాన్ని పోషించడం మానలేరు. మానరు. ఇందులోనూ ఎంత ప్రమాదం

వుంది. ఆ యజమాని యెప్పుడైతే సేవకుడు తిరుగుబాటొనరించే వుద్దేశాల్ని కలిగివున్నాడని తెలుసుకొన్నాడో, అప్పుడే ఆతనిని పనిలోనుంచి తొలగించివేస్తాడు. కుటుంబం, భార్యా బిడ్డలు, మాడిపోవలసివస్తుంది. ఆతనికి యేభయచ్ఛాయలూ లేకపోలేదు. కాని, యేవో కష్టాలు వస్తాయని మన కర్తవ్యాన్ని విస్మరించడమా? మరొకటి. వాళ్ళకి యిప్పుడున్న వాటికంటె ముందు యెక్కువ కష్టాలు వస్తాయా? సామాన్య కార్మిక కర్షక సంఘాల్లోకి వెళ్ళిచూస్తే నీకు కానవచ్చే పరిస్థితి యిదే: ఈ అసమానయుద్ధంలో,- అంటే సుస్థాపితాలైన సాంఘిక, రాజకీయ, ఆర్థిక, మత శక్తులతో పరికరశూన్యుడైన యీ కార్మికుడొనరించు పోరాటంలో, ఆతడెన్నిసార్లు యిట్లా వాపోయి యుంటాడోగదా!

"మనజీవితాల్ని కూడా లెక్కజేయక సామాజిక వ్యయంమీద చదువుకున్న ఆయువకులిప్పు డెక్కడవున్నారు. వాళ్లు చదువుకొంటూన్న రోజుల్లో వాళ్ళకు కావలిసిన దుస్తులూ, తిండీ యిచ్చింది మనమేకదా? యెండవానలు లెక్కపెట్టక కొండలు పిండికొట్టే బరువులు మోస్తూ, కడుపులోకి గంజినీళ్లైనా పూర్తిగా లేకపోయినా యీ పెద్ద పెద్ద భవనాలూ, కళాశాలలూ, మ్యూజియములూ, యిలాంటివెన్నో నిర్మించి యిస్తూన్నాము. పుస్తకాలు చదవడం మనకు తెలియనే తెలియదు. కాని, వాళ్ళకోసం యెల్లాంటి చక్కని పెద్దపుస్తకాలు అచ్చువేసి యిస్తూన్నాము! కళ్లు గుంటలుబట్టి, పాలిపోయిన ముఖాలతో, మానవ సంఘంయొక్క విజ్ఞానాన్నంతా తమ బుర్రల్లోనే యిముడ్చుకొన్నామనే పెద్ద పెద్ద మాటలు చెప్పే పండితులిప్పుడేమైనారు? వాళ్ళకళ్ళకు మనం పురుగుల్లా కూడా కనిపించము కాబోలు! స్వాతంత్ర్యాన్ని గురించి వ్యాఖ్యానాలుచేస్తూ, గంభీరంగా మాట్లాడే ఆ దేశభక్తులిప్పుడేమైనారు? నిత్యమూ ధూళిలోకి అణగద్రొక్కవేయబడుతూన్న మన స్వాతంత్ర్యాన్ని గురించి ఆ దేశభక్తులెప్పుడైనా

ఆలోచించేరా? ఈ వ్రాతగాళ్ళూ, కవులూ, చిత్రకారులూ, వీళ్ళూ వాళ్ళూ అన్నమాటేమిటి? ప్రతీవాడూ దీనప్రజలనీ, కష్టజీవులనీ, కళ్ళంట నీళ్ళు కారుస్తూ యెన్నో వుపన్యాసాలిస్తారు; కథలు వ్రాస్తారు; చిత్రాలు చిత్రిస్తారు; కాని, వాళ్ళు మన యీపోరాటంలో యేమూలనైనా కనిపిస్తున్నారా? సమాజంలో వున్న కుళ్లుని తొలగించడానికై మనం చేస్తూన్న యీ పోరాటంలో వాళ్ళు మనకెల్లాంటి సానుభూతినైనా చూపుతూన్నారా?"

కొందరు తమరెల్లాంటిస్థితిలోవున్నా, పిరికివాళ్లై వుపేక్షాభావంతోనే తిరగబడే సమర్థత, మగతనం లేక, తృప్తితో అనుభవిస్తూంటారు. మరి కొందరు సిగ్గునీ, మానుషాన్నీ విడిచిపెట్టి, సామాన్యప్రజలను తమ సౌకర్యాలకోసం నీచంగా దోచుకొంటూ, విశాలవుద్దేశాలుగల వారిపోరాటాన్ని యెదిరిస్తూ, కుతంత్రాలవల్ల దాన్ని అణిచివేయడానికి చూస్తూంటారు.

అప్పుడప్పుడు ఒక్కొక్క వుద్రేకస్వభావంకలవాడో, కీర్తి ప్రతిష్ఠలు కోరేవాడో, ఒక యువకుడు యీ పోరాటంలోకి వస్తూంటాడు. బహుశా, ఆతడు తన మనోవీధుల్లో పెద్ద పెద్ద వూరేగింపులూ, అధ్యక్ష పీఠాలు, యుద్ధరంగంలో జయంకలిగినమీదట లభించే గౌరవం, వీటినే చిత్రించుకొంటూ, ఆశాపూరితుడై దివాస్వప్నాలు కంటూంటాడు.

కాని, తనగమ్యస్థానానికి త్రోవ చాలాదీర్ఘమనీ, అది పువ్వులతోనిండినది గాక ముళ్ళతో నిండినదనీ తెలిసికొన్న తర్వాత తానంతవరకూ యేసిద్ధాంతాలకై పోరాడేడో వాటినేగంగలోముంచి పరుగెత్తుతాడు. సాధారణంగా వీళ్ళంతా ఆశతో యేదో బావుకుందామని వచ్చిన ఆత్రగాళ్లు. ఆ పాల పొంగుకాస్తా చల్లారిన తర్వాత వాళ్ళు సాధారణంగా పదవులకోసమూ, వోట్లకోసమూ మాత్రమే చూస్తూకూచుంటారు. వాళ్లు మొదట యే సిద్ధాంతాల్ని పొగడేరో వాటినే అమలులో పెట్టడానికి ప్రజలుచేసే పోరాటంలో, వాళ్ళకి వ్యతిరేకంగా వుండడానికి కొంచెమైనా సిగ్గుపడరు. వాళ్ళు

మీదనే తమ ఫిరంగుల్ని యెదురుత్రిప్పడానికి యేమీ సంకోచించరు. వాళ్ళమాట వేదవాక్యమని, యిదివరదాకా వాళ్ళ అధికారంక్రింద వున్న ప్రజలు వాళ్ళనిచూసే అట్లావున్నారనీ వాళ్ళవుద్దేశం. అంతేగాని ఏ వున్నతాదర్శాన్ని వాళ్ళు ఆరాధించేరో దానివల్లనే వారికి నాయకత్వాన్ని యిచ్చేరని అనుకోరు.

మధ్యతరగతి యువకుల్లో కొందరు యిల్లాంటి నీచత్వానికీ, గర్వంతోకూడిన అసహ్యతకీ పిరికితనంతోగూడిన అపవాదులకీ, ద్రోహాచరణానికీ వెనుదీయకపోయినా, చరిత్ర ప్రసిద్ధిగాంచిన ప్రతిసామాజిక విప్లవంలోనూ యీ తరగతి యువకులు ముఖ్యంగా పాల్గొంటూన్నారనే సంగతి అందరికీ తెలిసిందే. ఈ మధ్యతరగతి యువకులే ప్రజల్లో ఆత్మవిశ్వాసాన్ని విజృంభింపచేయడానికి ముందంజవేస్తూ, విప్లవాన్ని గమ్యస్థానానికి నడపుటకు తోడ్పడుతారు.

ఇంతపనివుంటూంటే, నేనేంచేయాలని నీవడగడంబాగుందీ? ప్రజాసామాన్యం, కార్మిక కర్షకులూ, ప్రపంచానికి కావలసివచ్చే సమస్త వస్తువుల్ని వుత్పత్తిచేసే యీ శ్రామికవర్గం,- శతాబ్దాలనుంచీ అజ్ఞానంలో వుంచబడి, దోచుకోబడుతూన్న యీ శ్రామికవర్గం,- బూర్జువావర్గంతో చేస్తూన్న మహాయుద్ధంలో వేలకొద్దీమంది యువకులకు తమ బుద్ధినీ, యౌవనోత్సాహాల్నీ, శక్తినీ, పూర్తిగా వినియోగించడానికి అవసరం లేకపోయిందా? ఉంది, ఉంది, ముమ్మాటికీ వుంది.

## మనం ఏమిచేయాలో వినండి!

శాస్త్రీయ సిద్ధాంతాల్ని ప్రేమించే ఓ విద్యార్థులారా! యువకులారా! మీకు సోషలిజమంటే సరిగా తెలిసినట్లైతే, మన తలుపుల్ని తట్టు

తూన్న యీ గొప్పవిప్లవాన్ని మీరు సరిగా అర్థంచేసుకొన్నట్లైతే, శాస్త్రాలనన్నిటినీ తిరిగి వర్గీకరించి నూతన సామాజిక సిద్ధాంతాలతో విరుద్ధం గాకుండావుండేటట్లు పనిచేయాలనీ, యీ మహారంగంలో వెనుక- యెవరూ- యెప్పుడూ కనీ వినీ యెరుగని సంపూర్ణమైన మార్పు తీసుకురావాలనీ, అట్లా చేయడం మీకు విధియై వుందనీ, మీకు వేరేచెప్పాలా?

ఇప్పుడున్న చారిత్రక గ్రంథాల్లో చక్రవర్తుల గాథలూ, గొప్ప రాజకీయవేత్తల కూటనీతులూ, రాజకీయసభలూ, పార్లమెంట్లూ, వీట్ల కార్యక్రమాలూ, పాలకజాతులూ దేశాభిమానంపేరిట స్వలాభంకోసం చేసే దారుణ సంహారాలూ,- యివి మినహాగా మరేమి వున్నాయి? ఈ చరిత్రల్ని కూడా నూతన పద్ధతులమీద సంస్కరించి వ్రాయవలసివుంటుంది. వాటిల్లో మానవ సంఘంయొక్క క్రమవికాసం; ప్రభుత్వమూ, మతమూ, వీట్ల వుద్దేశ్యాలూ; వీటివల్ల యేయేవర్గాలు లాభం పొందేయో; కార్మిక కర్షక వర్గం, ప్రజాసామాన్యం, వీళ్ళ స్థితిగతుల్ని ప్రభుత్వాలు యెట్లా దోపిడీచేసి, నాశనం చేశాయో; మొదలైన విషయాల్ని శాస్త్రీయ దృష్టితో వ్రాయాలిసి వుంటుంది. అర్థశాస్త్రాలన్నీ కూడా బూర్జువావర్గం శ్రామికుల్ని నిరంతరం దోపిడీచేసే పద్ధతుల్నీ, సులభమార్గాల్నీ, పరస్పర విరుద్ధ సూత్రాల్నీ, బోధిస్తూ, యీ పెట్టుబడిదార్ల దోపిడీ విధానమే మనకు ముక్తిదాయకమని బోధిస్తూ, యీ విధానాన్ని త్రోసివేస్తే చాలా ప్రమాదం తటస్థించుతుందని ప్రచారం చేస్తూన్నాయి. ఈ ఆర్థిక శాస్త్రాల్ని కూడా అంతర్జాతీయ దృష్టితో, ఆధునిక పారిశ్రామిక విప్లవాన్ననుసరించి తిరిగి వ్రాయాలి. ఈ విధంగానే మానవశాస్త్రం, సామాజిక శాస్త్రం, నీతిశాస్త్రం, మొదలైన వాట్లన్నిటిలోనూ సంపూర్ణమైన మార్పులు తీసుకురావలసివుంది. ప్రకృతిశాస్త్రంయొక్క వివిధశాఖల్లోకూడా ఆధునికమైన మార్పులు యెన్నో తీసికొనిరావలసి వున్నాయి. సరే, చాలును.

“ మాటలు చెప్తే కార్యం లేదు. మీరు కార్యరంగంలో దూకాలి. మీ శక్తినంతనీ యీ మహాకార్యం నిర్వహించడంలో వినియోగించాలి. శాస్త్ర విజ్ఞానంవల్ల మీ మీ అంధవిశ్వాసాల్ని పారద్రోలాలి. మానవత్వమనే సామాన్య ధర్మంపేర మనలోని ఐకమత్యాన్ని పెంపొందించాలి. మనల్ని నిరంతరం యెదుర్కొంటూన్న కఠిన సమస్యల్ని విడగొట్టే పద్ధతుల్ని నేర్చుకోవాలి. వైజ్ఞానిక శాస్త్రపరిచయంవల్లకూడా మీలో యిట్లాంటి శక్తులు విజృంభించకపోతే తప్పెవరిది? వెనుకటి శతాబ్దాల్లో తత్వశాస్త్ర వేత్తలు యెల్లాంటి త్యాగాలుచేసేరో అట్లాగే మీరుకూడా సత్యాన్వేషణకై, మానవ సమాజ కల్యాణానికై, అనంత త్యాగం చేసి, పోరాడుతూ, ఆదర్శప్రాయులుగా వుండాలి. ”

ఓ వైద్యుడా: చిరకాలానుభవంచేత నీవు, సామ్యవాదంలోని నిజాన్ని గ్రహించగలిగినవాడైతే, నీ కర్తవ్యమేమిటో తెలుసునా? నేటి సమాజంలోని మూఢాచారాలూ, జాతీ వ్యవస్థా, యిప్పట్లాగే వున్నట్లైతే మానవ జాతికి ఘోరపతనం తప్పదని ప్రజాసామాన్యానికి నీవు చెప్పవలసి వుంటుంది. ఇప్పటి అనారోగ్యకర పరిస్థితుల్లో, దారిద్ర్యంతో, పుట్టడం,— పెరగడం, జరుగుతూన్నంత కాలమూ యెన్ని కొత్త మందులు కనిపెట్టినా, యెందరు ధన్వంతరులు దిగివచ్చినా, రోగాల్ని యేమాత్రమూ తగ్గించలేరని ప్రజలకి నచ్చచెప్పాలి. రోగాలన్నిటికీ ఆర్థిక అవ్యవస్థా, భౌతిక అసమానత్వమూ,- యీ రెండే కారణాలని వారికి నిరూపించి చెప్పవలసివుంటుంది. ఈ భేదాల్ని నిర్మూలిస్తేనేగాని యీ రోగాల్ని అరికట్టలేమని చెపుతూ, దాంతోపాటుగా వాటిని నిర్మూలించే మార్గంకూడా చెపుతూవుండాలి.

ప్రతిక్షణం కుళ్ళిపోతూన్న యీ సమాజంలో తీసివేయాల్సిన భాగాల్ని శస్త్రచికిత్స చేసితీరాలి. మానవులు విశాల భావంతో తమ జీవితాల్ని నడుపుకోవలసిన పద్ధతినీ, అవకాశాన్నీ ప్రతివాడికీ చెప్పాలి. విర్జీ

వమైన శరీరాంగాన్ని ఛేదించకపోతే మిగిలిన శరీరాన్నంతనీ, నశింప చేస్తుందని వాళ్లకప వోధపర్చాలి.

ఓ యువకుడా! నీవు యంత్రవిద్యనీ, ఆధునిక శిల్పికళల్ని అభ్యసించేవుంటే, నీవు నీ పరిశ్రమకీ, పరిశోధనలకీ ఫలితం నిరూపించాలి. కర్తవ్యనిర్ధారణ చేసుకోలేకుండావున్నవాళ్ళకి, యింతవరకూ మావవుడెంతవిజ్ఞానం ఆర్జించినదీ, ఆ జ్ఞానసహాయంతో యెలాంటి సుఖజీవనాన్ని గడపవచ్చునో చెపుతూ, కర్తవ్యపరాయణులుగా చెయ్యి. ఈ యంత్ర సాధనాలు సమాజస్వాధీనంలోకి తేబడి, సరియైన వ్యవస్థలో నడుపబడేటట్లైతే అద్భుతమైన ఫలితాలు కలుగుతవని, సమాజ అవసరాల్ని దృష్టిలో పెట్టుకొంటూ వస్తూత్పత్తిచేస్తే అనేకరెట్లుగా వుత్పత్తి అధికమై, ప్రజల అవసరాలన్నీ తీరుతాయనీ, వాళ్లకి నచ్చచెప్పు.

ఓ యువకుడా! నీవు కవివీ, చిత్రకారుడివీ, శిల్పివీ, అయినట్లైతే నీ కర్తవ్యమేమిటో గుర్తించావా? నువ్వు ఆరాధిస్తూన్న కళయొక్క సంపూర్ణాభివృద్ధినే కోరేటట్లైతే, యిట్లారా. నీ కలాన్నీ, కుంచెనీ, ఉలినీ, సామాజిక విప్లవానికి మార్గం చేయడంలో వుపయోగించు. ఉత్సాహపూరితమైన రచన, భావగర్భితమైన చిత్రం, వీట్లతో అత్యాచారాలకి విరుద్ధంగా కార్మిక కర్షక వర్గం చేస్తూన్న విప్లవానికి దోహదం చెయ్యి. విప్లవాగ్నిని రగుల్చొల్పేటందుకై, మానవసమాజంయొక్క ఔన్నత్యానికై, యెవడు తన జీవితాన్ని అర్పిస్తూన్నాడో వాని భార్యయే ధన్యురాలని నొక్కి చెప్పు. శ్రామికవర్గానికి, వాళ్ల ప్రస్తుతావస్థ ఎంతదీనంగావుందో, అల్లాంటి స్థితికి కారణాలేమిటో స్పష్టంగా తెలియజెయ్యి. సమాజంలోని మూఢాచారాలూ, విపరీత సిద్ధాంతాలూ మన్నకు కళంకాలనీ, వాటిని మనం తొలగించేటట్లైతే మన జీవితం యింతకంటె యెన్నో రెట్లు వాంఛనీయంగా వుంటుందనీ చెప్పాలి సుమా!

ఒకటే ఆఖరుమాట చెపుతూన్నా. ఎవళ్ళదగ్గర జ్ఞానం, వక్తృత్వం, యోగ్యత, కష్టపడి పని చేయగల శక్తి, వున్నాయో అట్లాంటివాళ్ళంతా లేచి రండి! మీ మనస్సుల్లో కార్మిక కర్షకులయొక్క కష్టాలకి కొంచెమైనా సానుభూతివుంటే రండి! మీ స్నేహితుల్ని కూడా మన యీ న్యాయపక్షానికి తీసికొనిరండి. మానవ సమాజానికి యెవళ్ళు తమ జీవితాల్ని అర్పిస్తూ, విప్లవ సామగ్రిని సమకూరుస్తూన్నారో, వాళ్ళ పక్షాన్ని అవలంభించి మీ కర్తవ్యాన్ని నెరవేర్చుకోండి. కాని మీరంతా ఒక్క విషయాన్ని జ్ఞాపకం వుంచుకోవాలి. ఒక మహానాయకునివలెగాక స్నేహితునివలె రంగంలోకి దూకండి. నువ్వు యిక్కడ అధికారం చెలాయించడానికి రాక్కూడదు. ఒక నూతన జీవితంలో అడుగుపెట్టి, నీశక్తియుక్తుల్ని సామాజ క్షేమానికై వినియోగించడానికే వస్తూన్నాననుకోవాలి సుమా! ప్రజలకి వుపదేశించడంతోనే నీపని పూర్తయిందనుకోకు. ప్రజల కోరికలకు రూపంయిస్తూ, వాటిని పూర్తిచేసేటందుకు వాళ్లతోపాటుగా నీవు కూడా తీవ్రపోరాటం సల్పాలి. ఏ విధమైన విశ్రాంతి కోరకుండా నీలోని యావనోత్సాహాన్ని, జీవితానుభవాన్ని సమ్మిళితంచేసి కర్తవ్యమార్గాన్ని అనుసరించిన వాడవు గమ్ము. ఇల్లాచేస్తేనే నువ్వు సార్థక జీవితాన్ని గడిపినవాడవవుతావు. అప్పుడే నీవీ విషయంలో చేస్తూన్న ప్రయత్నాలన్నీ వ్యర్థమైపోవడం లేదని తెలుసుకోగలుగుతావు. ఎప్పుడైతే ఒకసారి నీ ఆలోచనలకీ, కార్యాలకీ యిట్లాంటి వున్నతభావముూలకమైన ప్రేరణ కలుగుతుందో అప్పుడే నీలో అంతర్హితాలై వుంటూన్న నీ వెప్పుడూ వూహించి కూడా వుండని, వుత్తమ కార్యశక్తులు నీకు కలుగుతాయి.

నీవీవిధంగా ప్రజాసామాన్యంతో కలిసిపోయి, న్యాయంకోసం సమానత్వంకోసం, యెడతెగని పోరాటంచేస్తూంటే, అంతవరకూ దూర

దూరంగా చెదరిపోయివున్న కార్మిక కర్షక శక్తులన్నీ నీయందే కేంద్రీకరించబడతాయి. ఇంతకంటే మనం కోరేదింకేముంది?

ఇప్పుడైనా ధనవంతులకూ, వున్నత పదవీవాదులకూ, రెండుమాటలు చెప్పకపోతే బాగుండదు. ఆ శ్రేణులకు చెందిన ఓ మానవులారా, మీ జీవితాల్లోని అశాంతినీ, ద్వైవిధ్యాన్నీ పోగొట్టుకోవాలంటే సోషలిష్టుల వద్దకు చేరండి. వాళ్ళతో కలిసి పని చేయండి. సామాజికవిప్లవాన్ని సఫలంచేసేయత్నాల్లో మీరుకూడా తోడ్పడుతూ, కార్మిక కర్షక వర్గాలకి మీ పూర్వులు చేసిన ద్రోహానికి ప్రాయశ్చిత్తం చేసుకోండి. మీలో యే మాత్రం విశాలభావం, శాస్త్రీయ విమర్శనాశక్తీ, మానవత్వమూవున్నా, సోషలిజం అంటే ఒక స్వాభావిక పరిణామంగా తోచకమానదు. కాని, ధనస్వామ్యవాదులకీ, సామ్రాజ్యవాదులకీ, యీ మహోన్నతాదర్శం అసంబద్ధంగానూ, దౌర్జన్యయుతంగానూ కనిపించడంలో వింతయేమీ లేదు. యుగయుగాలనుంచీ కోట్లకొద్దీ సామాన్యప్రజల్ని యీ వున్నతవర్గాలవారు చేస్తూన్న పీడనమూ, దోపిడీ, సంహారమూ,- దౌర్జన్యాలుకావనే వాళ్ళు వాదిస్తారు కాబోలు!

ఓ బీద సాదలారా! ఈ వర్గాలకిచెందిన యువకులైన మీతో రెండు ముక్కలు చెప్పితీరాలి. ఈ రోజుల్లో మీకు అట్టే యెక్కువగా చెప్పవలసిన అవసరం లేదు. ఏమంటే, మీరెంత విద్యావిహీనులైనా, బలహీనులుగావున్నా. దారిద్ర్యం, నిరుద్యోగం, సామాజికపీడనం, పెట్టుబడిదార్లదోపిడీ, మొదలైనవాట్లకుగురియై, నిత్యమూ మాడిపోతూన్న మీరు సోషలిస్టుల్లో చేరకుండా యెల్లావుంటారు? బీదవాళ్ళల్లో పుట్టికూడా యెవడు సోషలిస్టు విప్లవానికి దూరంగావుంటాడో వాడు తనసౌఖ్యంకూడా యెందులోవుందో యెరుగని మందుడనీ, మూర్ఖుడనీ, చెప్పకతప్పదు.

అబ్బా! అది నడిశీతాకాలం. మీరప్పటికియింకా వీధుల్లోఆడుకొావే

చిన్నవాళ్ళుగా వుండేవాళ్ళు. జ్ఞాపకంలేదూ? మీరు చిరిగిపోయిన గుడ్డలతో, వీధుల్లో ఆడుకొనేవాళ్ళు. ఆ చింకిరిగుడ్డల్లోంచి చలీ, దుమ్మూ, మీ శరీరాల్ని యెప్పుడూ పీడిస్తూవుండేవి. ఆ సమయాల్లో బాగాబలిసిన కొంతమంది పిల్లలు మంచి దుస్తులు ధరించి వీధంటపోతూ మిమ్మల్ని హేళనచేయడం జ్ఞాపకంలేదూ? మీకూ అభిమానంవుంది. ఆ అవస్థలో కూడా వాళ్ళల్లో యెవ్వడూ తెలివితేటల్లోకాని, పనిచేసే శక్తిలోగాని, మిమ్మల్ని మించివుండలేదని మీకు బాగాతెలుసు. అయితేనేం! మీరు, పేదవాళ్ళూ, తక్కువవాళ్ళూ, గాదామరి? వాళ్ళకున్న అవకాశాలు మీకేవీ? తరువాత కొద్దికాలానికే మీరు పొట్టకూటికై ఫాక్టొరీల్లో చేరో, యే అసామీవద్దో పాతేరుతనానికి కుదిరో, యంత్రాల్లోనూ, పొలాల్లోనూ, బానిసల్లాగ పనిచేస్తూ మీ జీవితాల్ని భారంగా గడుపుతూన్నారు. ఈలోపుగా ఆ లావాటిపిల్లలు, స్కూళ్ళూ, కాలేజీల్లోనూ దండయాత్రలు కొడుతూ పెద్దవాళ్ళై, మీ నెత్తిమీదకెక్కి కూర్చుంటారు. వాళ్లు మీ యజమానులట! అంచేత పొందదగిన జీవితసౌఖ్యాలన్నిటినీ మీనుంచే పిండి, వాళ్లు అనుభవిస్తూ కూచుంటారు. కాని, మీ అవస్థయెట్లావుంటుంది? ప్రతీరోజూ మీరు పనిలోంచి యింటికి కాళ్లీడ్చుకుంటూ, రొజుకుంటూ పోతారు. చీకటిగానూ, చెమ్మగానూ వున్న చిన్న కుటీరంలో చేరి, అరాస్తజాగాలోనే నీ కుటుంబం అయిదారుగురూ వంటా, పెట్టూ, విశ్రాంతీ, నిద్రా, కాలక్షేపం చేయాలి.

నడివయస్సులోనే వృద్ధాప్యాని పొందిన ఆ స్త్రీ నీ తల్లి కాబోలు! పాపం! ఆమె యిన్నిగంజినీళ్ళూ, నాలుగుమెతుకులూ నీ దగ్గిర పెడుతుంది. ఆ గంజినీళ్లైనా ప్రశాంతంగా త్రాగుతావా అంటే, అదీ లేదు. నూకలుకొన్న షాహుకారికి రేపు డబ్బివడమెల్లాగా? అనేది నీ హృదయంలో వేదన కలిగిస్తూంటుంది. అద్దెవాడు వచ్చి అడుగుతే ఏం చెప్పాలా?

అనే ఆలోచనకి అంతమే వుండదు. ఇల్లాంటి పరిస్థితుల్లో, పాపం, ఆ గంజినీళ్లైనా యెల్లా వంటబడతాయి, నీకు?

నీ పూర్వులంతా గడపిన దుఃఖపూరిత జీవితాన్నే నువ్వూ గడపాలని కోరుతూన్నావా? కొద్దిమందియొక్క సుఖవిలాసాలకోసం కోట్లకొలది మానవులు బలిచేయబడుతూంటే, నువ్వు కూడా సహించి వూరుకొంటావా? ఏ రోజుకారోజు, రేపటి గతేమిట్రా? అనే ఆలోచనతో బ్రతికివున్నంతకాలమూ వేదనపడదలచుకున్నావా? సోమరిపోతుల సుఖంకోసం, వాళ్ళకు సంపత్తుల్ని సమకూర్చడంకోసం, నీ జీవితానందానికి దూరమైపోదలుచుకున్నావా? నిరంతర పరిశ్రమచేతా, కష్టాలవల్లా, క్రమక్రమంగా క్షీణించిపోతూ, కష్టాల్లకై కన్నీరుగారుస్తూ, కర్మ, కర్మ, అంటూ వూరుకొనే వుండదలచుకున్నావా? నీలో కొంచెమైనా పౌరుషం లేదా? లే, సోదరా! నీకు యిప్పటికంటె ముందు యెక్కువ కష్టాలు వస్తాయా?

నువ్వు యిప్పుడున్న అవస్థలోనుంచి బయటపడేటందుకు మార్గం కనబడనప్పుడు, నువ్వు యిట్లా అనుకుంటావు: "మావంటి వాళ్లు కోట్లకొద్దీవున్నారు. లోకం అంతా యిల్లాంటి దురవస్థలోనే వుంది. ఈ పరిస్థితుల్లో మార్పు యెల్లా సాధ్యమౌతుంది. తిరగబడితే యీగంజి నీళ్లకికూడా మొహంవాచాలేమో! ఏదోకాస్త వున్నవాళ్లు ఎల్లా తిరిగినా, బావుంటుంది. కాని మాబోటివాళ్లు చాకిరీచేస్తూ, చచ్చినట్లు పడివుండడమే మంచిదేమో!" ఎల్లాఅనుకున్నా మీ జీవితాల్లోని కష్టాలే మిమ్మల్ని మేలుకొల్పుతాయి.

ఈ పెట్టుబడిదారీ లాభాల పద్ధతుల్లోమున్న పరస్పరవిరుద్ధశక్తులవల్ల సాధారణంగా వ్యాపారక్షోభ వస్తుంది. అందువల్ల మిల్లులు మూసివేయబడతాయి. వ్యాపారం మందగిస్తుంది. ధరలు పడిపోతాయి.

ఉద్యోగాలు పోతాయి. వేలకొద్దీమంది జనులు నిరుద్యోగులై మల మల మాడిపోతారు. పంటలు యధాప్రకారంగానే పండుతాయి. గాని ప్రజా సామాన్యానికి గంజికూడా కరువౌతుంది. మిల్లులు అందరికీ సరిపడే బట్టలు ఉత్పత్తి చేస్తాయి. కాని లాభాల్ని పంచడానికై ఉత్పత్తి నియమితం చేయబడుతుంది. బట్టగుడ్డలుకూడా లేక జనులు శీతవాతాతప బాధలకిలోనై పణికిపోతూంటారు. కుటుంబాలకి కుటుంబాలే మల మల మాడి, రోగాలతోటి పీడింపబడుతూ, చస్తూంటారు. ఏటేటా వైద్యకళాశాలల్లోంచి తరిఫీపై వేలకొద్దీ వైద్యశిఖామణులు పట్టాలుపొంది వస్తూంటారు. కాని, రోగాలకి ప్రజలు క్రమంగా ప్రతీయేటా అధికాధికంగానే బలియౌతుంటారు. ఈ పరస్పర విరుద్ధాల కన్నిటికీ మూలకారణం యేమిటి? సామాన్య కార్మిక కర్షక వర్గం యీ విధంగా పీడింపబడుతూంటే జమీందార్లు, భూస్వాములు, మతాధిపతులు, వర్తకులు, ప్రభుత్వోద్యోగులు, మొదలైన వాళ్ళందరూ మాత్రం యధాప్రకారంగానే సుఖభోగాలతో, యౌవనవిలాసాలతో, సుందరభవనాల్లో, కాలు క్రిందపెట్ట నవసరంలేకుండానే కాలం వెళ్ళబుచ్చుతూంటారు. శిస్తులు తగ్గవు. పన్నులు తప్పవు; అద్దెలు మామూలే; వడ్డీరేట్లూ, లాభాలూ యధాప్రకారంగానే వుంటాయి; ధనవంతులింకా అధికధనవంతులౌతూ వుంటారు. బీదవాళ్ళింకా బీదవాళ్ళవుతూ, దరిద్రంతో క్రుంగిపోతూంటారు. ఇల్లాంటి అవస్థలో నీకీసమాజవిధానంలోని లోట్లు కళ్ళకు కట్టినట్లు కనపడతాయి. నీచత్వంతో కూడిన సోమరిపోతుల స్వార్థానికై నిరంతరం కష్టించే సౌజన్యహృదయాలు లక్షల కొలదిగా బలిచేయబడుతూంటే, యీ సమాజాన్ని నిర్మూలించి, నూతన నిర్మాణం చేయవలసిన ఆవశ్యకత నీకు గోచరించదూ? అప్పుడే నీకు సోషలిస్టులు చెప్పే విషయాలన్నీ అర్థంకావడం ప్రారంభిస్తాయి.

సర్వజనీనమైన యిల్లాంటి వ్యాపారక్షోభమాట అల్లావుంచి, మీ స్వవిషయాన్ని గురించి మాట్లాడుకుందాము. తమ వ్యాపారంలో లాభాలధికం చేసుకోవానికి నీ యజమాని కూలీల జీతాలు తగ్గించవచ్చు. లేదా, రోజుకు యేడెనుగంటలలో అధికంగా పనిచేయమనవచ్చు. మీరాఅన్యాయాన్ని నిరోధించవోతే ఆతడు మండిపడి. "లేచిపోండి! వెళ్లి యేం గడ్డి తింటారో, యేం చేస్తారో చూస్తా. ఈ కూలిపనైనా యెవడిస్తాడో మీకు?" అంటాడు. అప్పుడే మీకు తెలుస్తుంది. నీ యజమాని మిమ్మల్ని గొర్రెను గొరిగినట్లు గొరగడమే గాకుండా, మిమ్మల్ని యింకా నీచంగా చూడదలచేడని. ఈ పెట్టుబడిదారీ వస్తూత్పత్తి పద్ధతీ, ఆర్థిక అసమానత్వమూ, మిమ్మల్ని శాశ్వతంగా బానిసలుగా చేస్తున్నాయని, వాటిని నిర్మూలించనంతవరకూ మీస్థితేమీ బాగుపడదనీ గ్రహించగలుగుతారు. మీరాసమయాల్లో వాళ్ళకు లొంగిపోయారా, మీలోని మానుషత్వం నశించిపోయినట్లే! మీరక్తమాంసాలన్నీ పిండేసిన తర్వాత మిమ్మల్ని దూరంగాతోసేస్తారు. అల్లాంటి అవకాశం వాళ్ళకు యెందుకీయాలి? మీరక్తంలో వేడి అంటూవుంటే వాళ్ళదురంతాల్ని ధైర్యంగా యెదిరిస్తారు. వాళ్లు మిమ్మల్ని పనిలోనుంచి తొలగిస్తారు. అప్పుడు మీరు 'బ్రతుకు జీవుడా' అని సోషలిష్టులదరిచేరి, యీ ఆర్థిక, సామాజిక, రాజకీయ బానిసత్వాలన్నింటినీ రూపుమాపి, నూతన సమాజాన్ని స్థాపించడంలో తోడ్పడతారు.

ఓ యువతుల్లారా! సమాజంలో మీరెక్కడవున్నారు? బానిసలకంటె అధమాధమస్థితిలో గాదా? ఆర్థిక బానిసత్వం మీ ముఖ్యలక్షణం! నిరక్షరత మీ ముఖ్యయోగ్యత! పల్లెటూళ్ళల్లో తిండికికూడా జరక్కపోవడంచేత యే కూలిపని దొరుకుతుందనో, యే ఫాక్టరీలో చేరుదామనో పట్టణాలికి చేరుకుంటూన్న బీదవాళ్ళూ, కృషికస్త్రీలు యెంతమందున్నారు!

మీకూ తెలుసును. పట్టణాల్లో జీవించడం కష్టతరమని. కాని యేమిటి గత్యంతరం? పాపమూ సోదరీమణుల అవస్థ యేమవుతుందో తెలియదూ? ఎవడో కాస్త నాలుగు పేస్సా నోట్లోకి పోయే అవకాశాలున్న పెద్దమనిషి, వాళ్ళ బీదతనాన్ని అవకాశంగా తీసుకొని తియ్యని మాటలు చెప్పి, ఆమెను వలలో వేసుకుంటాడు. ఆమెను తనకు అవసరం వున్నంతవరకూ వుపయోగించుకుంటూ తర్వాత పాలల్లో బడ్డ యీగను పారేసినట్లుగా దూరంగా త్రోసేస్తాడు. ఆ అవస్థలో ఆమె నెత్తిమీద ఒక బిడ్డ భారంకూడా పడుతుంది. దానితోటే ఆమె పతనం ప్రారంభం. దుఃఖకరమైన జీవితాన్ని గడుపుతూ, కొద్దికాలంలోనే తన యౌవనాన్ని పోగొట్టుకొని, యేరోడ్డు పక్కనో తన జీవితాన్ని ముగిస్తుంది. ఇలాంటి కథలు యెన్నింటినో దినదినమూ వింటూంటాము.

భౌతిక వాంఛల్ని పొందడానికే గదా మానవులిట్లాంటి దురంతాలకి పాల్పడుతూన్నారు. కాని, ఆ భౌతికదానిసత్వాన్ని నిర్మూలించడానికి మీ రెట్టి యత్నాల్ని చేస్తూన్నారు? ఓ సోదరీమణులారా! కార్మిక కర్షక యువతుల్లారా! మీ చిన్ని బిడ్డల్ని ఒడిలోనుంచుకొని పాలిస్తూన్నప్పుడు, భవిష్యత్తులో ఆ బిడ్డలు యెంతబాధ పడవలసివుంటుందో, యీ సమాజ నియమాలు వాళ్లనెంతగా పీడిస్తాయో, యోచించడంలేదా? మీ మీ తల్లి తండ్రులు యెట్లాంటి బాధలు పడ్డారో, మీ భర్తలు సోదరులూ యెట్లాంటి కష్టాలనుభవించేరో, మీ జీవితాలు యెట్లాగ తుచ్ఛంగా వుంటూన్నాయో తెలియటంలేదూ? మీ చెల్లెళ్ళూ, తమ్ములూ, కూతులూ, కొడుకులూ, ముందుముందుకూడా కట్టగుడ్డా, వుండనిల్లూ, తినతిండీ లేక నిరంతర కష్టాలతో చినికిపోయి, యెన్నిబాధలుపడాలో తెలియడంలేదా? మీ వెనకటి వాళ్ళందరూ యెట్లాకృశించి, రాలిపోయేరో అట్లే మీ ముందుసంతతుల వాళ్ళుకూడా బాధలతో నశించిపోవాలని మీరు కోరుతారా? వాళ్ళుకూడా

'రేపటి మాటేమిట్రా?' అనే ఆలోచనతో అవసిపోతూండాలనే మీ యిచ్ఛా? కాలక్షేపం చేయాలంటే కల్లుదుకాణంతప్ప వాళ్ళకేమీ వుండకూడదనే మీ ఆశయమా? సామ్రాజ్యవాదప్రభుత్వ దుర్ణయాలకీ, వాళ్ళ ఆశలకీ, మీరంతా బలియైపోవలసిందే? మీ రెక్కలకష్టంవల్ల వుత్పత్తియైన వస్తువులవల్ల లాభాలుగడించి, సుఖాన్నీ, ఆనందాన్నీ అనుభవిస్తూన్న ఆ సోమరిపోతుల దయ ధర్మ బిచ్చాలపై మీభర్తలూ, పుత్రులూ, కుటుంబాలూ, ఆధారపడివుండవలసిందేనా? రాజకీయాధికారం చేతా, మతంపేరిట జరిగే మూఢాచారాలవల్లా, మిమ్మల్ని అజ్ఞానాంధ కారంలో వుంచడంచేతా, మీలోని మానుషాన్ని తరతరాలనుంచీ అణిచి పెట్టివుంచేరు. మిమ్మల్ని పీడిస్తూన్న యీ దోపిడీవిధానాన్ని కాదనడానికి మీలోని శక్తినంతనీ కేంద్రీకరించుకోండి. మీభర్తలు పౌరుషహీనులై, కర్తవ్యతామూఢులై, యీ బానిసత్వాన్నే తలొగ్గిభరిస్తూన్నప్పుడు మీరక్తం వుడుకెత్తడం లేదా? కర్తవ్యపథాన్ననుసరించిన వెనుకటి వీరమాతలే మీ కాదర్శం! లెండు! మనల్ని యిక్కడే నరకబాధలన్నీ అనుభవింప చేస్తూన్న యీ సమాజవిధానాన్ని నాశనంచేయడానికి లేచి రండి!

## మన కర్తవ్యం యేమిటి?

ఓ యువకుల్లారా! యువతుల్లారా! కర్షకుల్లారా! కార్మికులారా! సిపాయిలారా! కూలీలారా! మీ హక్కుల్ని గుర్తించండి. మీ స్నేహితులతో గలిసి ఆ సామాజిక విప్లవం కోసం,- మూఢవిశ్వాసాల్ని నాశన మొనరిస్తూ, నూతనమూ విశాలమూ అయిన జీవితవిధానాన్ని చూపించే విప్లవంకోసం,- ప్రయత్నించండి! మానవుల్లో నిజమైన స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం, పెంపొందింపచేసే ఆ మహోన్నతాదర్శపూర్వ

కమైన విప్లవానికై యెదురుచూడండి! మీ మీ కష్టానికి తగిన ఫలితము అప్పుడే కలుగుతుంది. మీయందు విశాలభావం, మానవత్వం, అప్పుడే కలుగుతాయి. మీ భౌతికవాంఛలు అప్పుడే తీరుతాయి. అట్టి నిర్మాణకరవిప్లవాన్ని సృష్టించండి.

మాకేం సాధనాలు లేవు: ఐకమత్యం లేదు: జనస్తోమము లేదు; అంటారేమో! మీ నిర్మాణశక్తియే, మీ రెక్కలకష్టమే, మీ ఆయుధం. మీ కోరికలే మీలో ఐకమత్యంకలుగగోస్తాయి. ఇంక సంఖ్యవిషయం చెప్పాలా? ఈ అత్యాచారాల్ని సహిస్తూన్న జనసంఖ్యని లెక్కపెట్టండి. సంవత్సరం పొడుగునా రెక్కలు ముక్కలుచేసుకుని, అన్నిపంటలూ పండించి, భూస్వాములకీ. జమీందార్లకీ, ప్రభుత్వానికీ, షాహుకార్లకీ యిచ్చేస్తూ. పస్తుపడివుంటూన్న వ్యవసాయికులం మనంకోట్లగొద్దీవున్నాం! నూలుతోటీ, పట్టుతోటీ రోజుకి పదిగంటలు రెక్కలు విరుచుకుని రకరకాల బట్టలు నేసియిస్తూ, చింకిరిగుడ్డలు కట్టుకుని చలికీ, గాలికీ బలియౌతూన్నదిక్కుమాలిన వాళ్ళం మనం యెంతమందిమున్నాము! గనుల్లో పనిచేసి మనప్రాణాలుకూడా అర్పించినా, మన కుటుంబాలు మట్టుకు గంజి గతిలేకుండానే వుంటూన్నాయి: కాని కంపెనీ వాటాదార్లంతా సరికొత్త 'రాల్సు- రాయిస్' కార్లలో షికార్లు కొడుతూనేవున్నారు. మిల్లుగంట కొట్టడంతోనే యిండ్లకుపోయే పారిశ్రామికకూలీలని. పెద్దపెద్దపట్టణాల్లో వీధులన్నిటినీ నింపుకొంటూ పోతూన్న మనల్ని యెరుగరూవాళ్ళు!

చక్కనిభవనాల్లో పంకాలక్రిందకూర్చుని మిలమిలలాడేదుస్తుల్లో బాగాబలిసి, ఎండకన్నెరగకపోవడంవల్ల ఎర్రగావున్న శరీరాలతో, ఒక్క కలంపోటుతో మనల్ని లక్షలకొద్దీమందిని దారుణయుద్ధాలకి పంపే, యీ దుర్మార్గులికి మనసంగతి తెలియదూ? ఆ యుద్ధాల్లో మనం యెవరిప్రాణాలు తీస్తూన్నాము? ఎవరికోసం మన ప్రాణాల్ని అర్పిస్తూన్నాము?

ఆలోచించండి. ఒక్కసారి కళ్ళు తెరవండి. మీ బలంతో మిమ్మల్నే నాశనం చేయిస్తూన్న యీ సామ్రాజ్యకాంక్షుల బలం యిప్పుడే మీకు తెలిసిపోతుంది! మీరు సగర్వంగా నిలబడ్డారా వాళ్ళు తెలతెలపోతూ, నాలిక్కొరుక్కోవలసిందే! అట్లాంటి మీరు లక్షలకొలదీవున్నారు.

నిత్యం అవమానింపబడుతూ తిరస్కరింపబడే మన సంఖ్యకి హద్దేమిటి? మనం మేలుకొన్నామా, ఉప్పెనలా అన్నిటినీ ముంచి వేస్తాము!

మనం యెప్పుడు ఆత్మవిశ్వాసంతో, స్వాతంత్ర్యస్థాపనకై ముందుకి వురుకుతామో అప్పుడే యీ పరాన్నభుక్కులూ, పరభాగ్యోప జీవులూ, తొలగించబడతారు. సోదరా! నీవింకా సందేహిస్తూన్నావా?



